వాసుదేవరావు, నాగసముద్రము

# అనంతపుర చరిత్ర కథలు

బళ్ళారి, 1916

Record no. 691

Vāsudēvarāvu, Nāgasamudramu

Anantapura caritra kathalu

Baḷḷāri, 1916

Record no. 691

## Bibliographic Record Target

వాసుదేవరావు, నాగసముద్రము.
అనంతపుర చరిత్ర కథలు / నాగసముద్రము వాసుదేవరావుచే వ్రాయబడినది.- బళ్ళారి : కామేశ్వరీ ముద్రాక్షరశాల, 1916.
102 p. :(10) ill., ;18 cm.
Record no. 691

Vāsudēvarāvu, Nāgasamudramu.
Anantapura caritra kathalu / Nāgasamudramu Vāsudēvarāvucē vrāyabaḍinadi.- Baḷḷāri : Kāmēśvarī Mudrākṣaraśāla, 1916.
102 p. :(10) ill., ;18 cm.
Record no. 691

35 mm microfilm
Image placement: IA (IIA) IB IIB    Date filming began:




# STORIES FROM THE History of Anantapur.

# అనంతపుర చరిత్ర కథలు.


BY

**N. VASUDEVA RAO,**
*Asst. Master,*
*Board Secondary School,*
*PENUKONDA.*





1916.

PRINTED AT THE KAMESWARI PRESS,
BELLARY.




*Price As. 6.*

C. RAMALINGA REDDY.

*With the compliments of the author*

# అనంతపుర చరిత్ర కథలు.



ఇయ్యది,

అనంతపురము జిల్లా పెనుకొండలోనుండు

బోర్డు సెకండరీ పాఠశాలయందు

ఉపాధ్యాయుడుగనున్న

నాగసముద్రము వాసుదేవరావుగారిచే

వ్రాయబడినది.



బళ్ళారి,

కామేశ్వరీ ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.



వెల 0-6-0.

# అంకితము.

—:o:—

చిన్ననాటనుండియు నన్ను తమయింటనుంచుకొని
తమపుత్రులకన్న నెక్కువగ నన్నాదరించుచూ
విద్యాబుద్ధులగరపి నన్నుద్ధరించిన
నా మేనమామలగు
యస్. నారాయణరావు, యస్. శామారావు
అనువారలయెడల
నాకుగల భక్తి విశ్వాసముల తెలియఁజేయ
నేనీచిన్న గ్రంథమును
కృతజ్ఞతా పూర్వకముగా
వారి కర్పించు చున్నాడను.



# PREFACE.

---

In the Scheme of 'Studies for Elementary Schools' it is recommended that in teaching history "Stories relating to historical events or historical buildings in the locality should be given preference." Again in the "Suggestions for Managers and Teachers of Secondary Schools" it is suggested that in teaching Indian history "something might be done by a simple but systematic study of the neighbourhood or district and that in the course of study reference should be made to relics in the way of ruined temples or forts and to the geography of the area studied with reference to its known history."

A book on these lines and on sound teaching principles has been a long felt want.

I lay claim to no originality in the work beyond placing the available information in a clear and simple form before the child. The facts narrated in most of these stories have been drawn from C. P. Brown's "Annals of Handeh Ananthapuram," and the 'District Gazetteer of Anantapur.' Of course I have added a few facts which I gathered from personal observation.

Often the language in histories is so difficult that before the student proceeds to comprehend the history, he has to waste considerable time and energy to understand the meaning of words and sentences. I have narrated the stories in a clear and simple language intelligible to children for whom the book is intended. Before the child attempts to learn the past history of

the country it is essential that the child should know what is daily passing around him in the district, thus proceeding from the known to the unknown. In the second lesson. 'India of today' a broad out line of the present administration of the country has been presented to the child and the child is led to see how the district is only a part of the presidency and the presidency a part of the Indian Empire. In the lesson 'what the English have done for us', which is only a lesson on civics, only those benefits which are in the daily experience of the child, are narrated. I am sure that this book does not lend itself to cramming. Suggestive questions have been interspersed freely with a view to stimulate the powers of thinking and observation. The principle 'Things before words' has been observed. Often the story commences with the picture of a historical personage or monument and proceeds to lead the child to grasp the history connected with it.

The dry facts of history must be narrated to the child in a graphic and interesting manner. For this purpose only interesting events, personages and monuments have been selected. To render the teaching of history realistic historical albums containing pictures of famous men and places of historic interest in the district are quite indispensable. No pains have been spared to collect the pictures of historical relics in the district and the illustrations in the book bear testimony to this fact.

Every attempt has been made to connect cause with the effect and to create in the child admiration for noble persons and heroic deeds and a hatred for vice. How for the attempt has been a success it is left to my brethren to decide.



This is the first book of its kind and I am conscious of the fact that it is sure to be defective in several ways. But with the suggestions of my experienced brethren in the field, I hope to improve it in the 2nd edition if it should ever call for one.

It remains for me to express my gratitude to those that have helped me in this work. My thanks are due to A. H. Longhurst Esq. Supdt. Archaelogical Survey, Madras for having kindly supplied to me five bromide photo prints. (1 Gagan mahal 2 Ratnagiri fort 3 Temple at Tadpatri 4 Sir Thomas Munro 5 Huge-bull at Lepakshi- and to Messrs. D. Vasudeva Rao, B. A. Sub Asst. Inspec) tor of Schools, and P. T. Narayanacharlu Headmaster Secondary School, Penukonda, for their valuable help rendered to me in the preparation and publication of this book.

Finally I have to thank Mr. T. Sivasankaram Pillai of Penukonda for his valuable suggestions and Messrs. M. P. Sarma & Co., Bellary for the neat and prompt execution of the work entrusted to them.

SECONDARY SCHOOL,
PENUKONDA, JANUARY 16

**N. V. R.**

# CONTENTS. విషయసూచిక.

18. Fort at Ratnagiri. — రత్నగిరి కోట.

19. Gagan Mahal. — గగనమహాల్.

20. Kundurpi. — కుందుర్పి.

21. Chintalaraya's Temple. — చింతలరాయని దేవాలయము.

22. Dharmavaram. — ధర్మవరము.

23. How the English got our District. — ఆంగ్లేయులకు మనజిల్లా ఎట్లొచ్చెను.

24. Sir Thomas Munro. — మన్రోప్రభువు.

25. What the British have done for us I. — ఆంగ్లేయులు మనకేమి మేలుచేసిరి. I.

26. do. II. — డిటో. II.

# ఉపాధ్యాయులకు సూచన.

———:o:———

ఈచరిత్ర కథలను బాలురకు బోధించునపుడు ఉపాధ్యాయుఁడు అనంతపురముజిల్లా పటమును బాలురయెదుట నుంచవలెను. కథలయందు చదివినగ్రామములపేర్లను పటమున బాలురకుఁ జూపవలెను. పిదప నల్లబల్లపై అనంతపురముజిల్లా పటమును వ్రాసి అందొక్కొక్క బాలుని ఒక్కొక్క గ్రామమును గుర్తింపుమని యడుగవలెను. పటములేనిది చరిత్ర నెప్పటికిని బోధింపఁబూనుకొనరాదు. ఉపాధ్యాయుఁడు, తనయూరియందు చరిత్ర సంబంధమైన కట్టడములు, దేవాలయములు మొదలైనవి యుండినచో వానివద్దకు బాలురను పిలచికొనిపోయి ఆకట్టడములను బాలురకుఁజక్కఁగ చూపించి పిదప పాఠశాలయందు వానింగూర్చి వివరముగఁ దెలుపచ్చును.

ఈజిల్లాలో నితర గ్రామములయందుండు చరిత్ర సంబంధమైన కట్టడములను దేవాలయములను, దుర్గములను, దర్శించుటకు బాలురను వెంటఁబెట్టుకొని పోవుటెంతయు లాభకరము. పదిమారులు గ్రంథమునుఁ జదువుటకంటె నొక్కమారు కనులతోఁజూచుటెంతయు నుత్తమము. అట్లుకనులారఁ జూచినదానిని బాలురెన్నటికిని మఱచిపోరు. ఇయ్యదియించుక కష్టసాధ్యమైన పనియనుట నిక్కమేమైనను, తలిదండ్రు

లకిట్టి యాత్రలవలని యుపయోగమును, వానియావశ్యకతను బోధించినవారు సంతోషముతోనియ్యకొని యుపాధ్యాయునికి సాయముచేయుదురు. ఈకథలలో "నొక్కొక్కరుచేసిన కార్యములెట్టివి? అందువలన వారెట్టి గుణములుగలవారని యూహింపవచ్చును.? అట్టిగుణములను గలిగినందులకు వారెట్టిఫలములను బొందిరి.?" అని ముఖ్యముగబోధించుచు, దుర్మార్గులు తుదకు శిక్షింపఁబడుటయు, సన్మార్గులు తప్పకసుఖమును బొందుటయు బాలురకు ముఖ్యముగా బోధింపవలయు

బాలురు ఈకథలను కంఠపాఠముసేయక, తాముమఱచియున్న యంశములను జ్ఞప్తికిఁదెచ్చుకొనుటకుమాత్రమే యీగ్రంథమునుపయోగించునట్లు, ఉపాధ్యాయులు శ్రద్ధతీసికొనవలెను.

అచ్చటచ్చట గనఁబఱచియుండు సంవత్సరములసంఖ్యనుగూడ బాలురంతగా జ్ఞప్తియందుంచికొన నక్కరలేదు.

ఇందు వ్రాసియుండు విషయమునకంటె నెక్కువగానే గ్రామమును గుఱించియైన నుపాధ్యాయునకుఁ దెలసియున్న దానినికూడ బాలురకు బోధింపవచ్చు,

ఇట్లు
విధేయుడు,
గ్రంథకర్త.

# FOREWORD

The short stories narrated by MR. N. VASUDEVA RAO, in this booklet, should be an interesting and profitable reading to the young as they are intended to be. They are woven by him from the scattered accounts of some of the events in the history of the tract of the country, now comprised into the present District of Anantapur, and, told in simple and elegant Telugu. They will lead the young students to make a study of the past history of the District where they were born. Public appreciation and encouragement of this laudable enterprise will not only stimulate MR. N. VASUDEVA RAO to make further researches and give us the benefit of more connected and fuller narratives of the old times; but also induce our educated countrymen with a literary turn of mind and a capacity for industry, to undertake similar tasks for the information and enlightenment of our people.

GOOTY,

*7th May, 1916.*

**The Honourable, Rao Bahadur,**

**P. KESAVA PILLAI.**



శ్రీ పంచమ జార్జి చక్రవర్తి.



శ్రీరామచంద్ర.

# మన చక్రవర్తి.

---

బాలులారా! ప్రక్కపుటయందున్న బొమ్మను చూచితిరా? అది మన రాజుగారి పటము. అతఁడే మన దేశమును పాలించు చక్రవర్తి. అతని పేరు ఐదవజార్జి చక్రవర్తి. అతఁడు ఎచ్చటనుండునో మీరెఱుఁగుదురా? అతడుండు దేశము పేరు ఇంగ్లాండు. ఇంగ్లాండు దేశమునకురాజు ఇతఁడే. ఆదేశము ఇచటికి చాలదూరమున నున్నది. మనము అచటికి పోవలయునన్న ఎన్నియో సముద్రములను గడచిపోవలయును. వేగముగాఁబోవు పొగయోడలోఁ గూర్చుండి పోతిమేని సుమారు 16, 17, దినములు కడచినపిదప మనము ఆదేశమును చేరఁగలము. ఆదేశమున నుండువారు 'ఆంగ్లేయులు.' వారు మన హిందూదేశమును జయించిరి. అందువలననే మనకు ఐదవజార్జి చక్రవర్తి యయ్యెను.

ఇతఁడు "ఐదవ జార్జి" అని పిలువఁబడుటకుఁ గారణ మేమి? ఇతనికి పూర్వము రాజులుగనుండినవారిలో జార్జిఅను పేరుగలవారు నలుగురుండిరి. కనుకనే ఇతఁడు ఐదవ జార్జి యయ్యెను.

ఇతడు మనదేశమునకు చాలదూరమున నుండినను మన క్షేమమును విచారించుకొనుచు, మనసౌఖ్యమునకుఁ దగిన పనులుచేయును. ఇతనికి మనయందు ఎంతయోప్రేమ.

ఇతని తండ్రిపేరు ఏడవ ఎడ్వర్డు. తల్లి అలెగ్జాండ్రా రాణి. జార్జి 1865 సంవత్సరమున పుట్టెను. అనగా ఇప్పటికి 50 సంవత్సరములకు పూర్వము. జార్జి చక్రవర్తికి విక్టరు అను అన్నయుండెను. అన్న చిన్నవయసుననే చనిపోవుటచే ఎడ్వర్డు చనిపోయిన పిదప జార్జి ఇంగ్లండునకు రాజాయెను.

ఇతఁడు చిన్నతనమున సామాన్యజనులతోఁగూ టానియా నావయందు నావికావిద్య నేర్చికొనెను. 1893-వ సంవత్సరమున నితఁడు మేరీ అనునామెను పెండ్లిచేసికొనెను. తండ్రి బ్రతికియుండినపుడే జార్జి రాకుమారుఁడు తండ్రికిఁ జేరిన ఆస్ట్రేలియా, కెనడా, ఆఫ్రికా ఖండములనుజూచి అచట జనుల స్థితిగతులను కనులారఁ జూచివచ్చెను. 1904-వ సంవత్సరమున నితఁడు హిందూదేశమునకుకూడ వచ్చెను. తండ్రిచనిపోయిన పిదప ఇతఁడు ఇంగ్లండునకు రాజాయెను. మరల ఇతడు తన భార్యతో 1911-వ సంవత్సరమున బయలుదేరి మనదేశమునకు వచ్చెను. 1911-వ సంవత్సరము డిశంబరు నెల 12వ తేది డిల్లీపురమున నొక దర్బారు జరుపబడెను. ఆనాడు మనదేశమంతయు నానందముతో నిండియుండెను.



ఆనందోత్సవసమయమున జార్జిచక్రవర్తి మనదేశపు జనులకు కొన్నివరముల నొసఁగెను. వానిలో ముఖ్యమైనవి మూడు. 1 విద్యకై 50 లక్షల రూపాయలియ్యఁబడెను. 2 హిందూదేశపురాజధాని కలకత్తా నగరమునుండి డిల్లీకి మార్చఁబడెను. 3 వంగదేశమును కొంతకాలమునకుముందు రెండు భాగములుగ భాగించియుండిరి. అందువలన జనులకు కొంచెము కష్టముగానుండెను. జార్జిచక్రవర్తి ఆవిభజనమును రద్దుచేసెను. ఇప్పటికిని డిశంబరునెల 12వ తేదీని పాఠశాలలయందు చక్రవర్తిగారి పటమునుంచి, ఆటపాటలతోఁ గొంతకాలముగడపి బాలురకు ఫలహార వస్తువులనుకూడ ఇచ్చెదరుకదా? మనయందింత దయఁగలిగి పాలించుచున్న పంచమ జార్జి చక్రవర్తిగారిని దైవము చిరకాలముఁ గాపాడుఁగాక!

1911 సం॥ జూను నెల 22వ తేది లండను నగరమున జార్జి చక్రవర్తికిని మేరీ చక్రవర్తినికిని పట్టాభిషేకము నరింపఁబడెను. ఆసమాచారమును డిల్లీదర్బారునందు జార్జి చక్రవర్తి అందఱికిని తెలియఁజేసెను.

## 2. ఇప్పటి పరిపాలన.

మన ప్రభువులు ఆంగ్లేయులనియు వారిదేశమిచటికి చాలదూరమున నున్నదనియు చదివితిరిగదా? ఆదేశమునకే

మన చక్రవర్తిగారైన పంచమజార్జి గారుండునది. వారు అంతదూరముననున్న మన దేశమును పాలించువారెవ్వరు? అప్పుడప్పుడు చక్రవర్తిగారు తమకుబదులుగా మనలను పాలించుటకు నేర్పరులను పంపెదరు. వీరు చక్రవర్తిగారికి బంధువులుగారు. అయినను వీరు ప్రజ్ఞావంతులుగనుందురు. దేశమును పాలించుటలో మంచి నేర్పరులుగానుందురు. వీరు అంత దూరమునుండి రాజునకు బదులుగా జనులను పాలించుటకు వచ్చెదరు. ఇట్లు వచ్చువారిలో నందరికన్న గొప్పవానికి 'వైస్‌రాయి' అనిపేరు. వైస్‌రాయి అనుపదమునకు రాజునకుబదులుగా రాజ్యమును పాలించువాఁడని యర్థము. ఇతఁడే మన దేశమునకంతయు నధిపతి. ఇతనిని రాజుగారు నియమించెదరు. మన దేశపు వరమానమునుండియే ఇతనికి జీతమియ్యఁబడును.

వీరు మన దేశమునందు సాధారణముగా నైదేండ్లుండి మరల తమ దేశమునకు వెళ్లెదరు. ఇప్పుడు మన దేశముననుండు వైస్‌రాయి, హార్డింజ్ ప్రభువు. వీరు మన దేశమునకై ఎంతోపాటుపడుచున్నారు. జనులకు వీరియందు చాలవిశ్వాసము. వీరు 1910వ సంవత్సరమున మన దేశమునకువచ్చిరి. కనుక వీరు 1915వ సంవత్సరమున తమ దేశమునకు మరల పోవలయునుగదా? అయితే మన దేశములోని



ప్రజలెల్లరును వీరి గుణములకు సంతసించి, "ఇట్టివారు మరల మనకు ప్రభువులుగ వత్తురో రారో" అని సంశయించి, వీరే యింకను కొన్నిసంవత్సరములుండిన మంచిదని తలంచి చక్రవర్తిగారితో మొఱలిడిరి. వారు జనులకోరికమేరకు వీరినియింకను కొన్నినెలలు (1916 సం॥ మార్చినెలవఱకు) ఇచ్చటనేయుంచియున్నారు. వీరు మన హిందూదేశమున ఉత్తరముననుండు ఢిల్లీనగరమున నుండెదరు. ఢిల్లీనగరమే ఇపుడు హిందూదేశమునకు ముఖ్యపట్టణము.

అయినను వైస్‌రాయి తన యిష్టమువచ్చినరీతి చేయుటకు వీలులేదు. పూర్వము మన దేశముననుండిన రాజులు తమ మాటనే శాసనముగా నెంచియుండిరి. కనుక కొందఱు రాజులచే ప్రజలకు చాలకష్టము కలుగుచుండెను. ఇప్పుడట్లుకాదు. వైస్‌రాయిగారికి రెండు సభలున్నవి. ఆ సభలలో మనస్వదేశీయులును ఆంగ్లేయులును సభ్యులుగనున్నారు. వారిఅభిప్రాయమును తీసికొని వైస్‌రాయి ఏపనినైనను చేయును.

వైస్‌రాయిగారికి తరువాత గొప్పయుద్యోగస్థుడు ప్రథమసేనాధిపతి. ఇతఁడు మన దేశముననుండు సైన్యమునకంతటికిని అధికారి. మన దేశముపై నితరులు దండెత్తివచ్చిన, వారిని పాఱఁదోలి దేశమును రక్షించుటయే వీరిపని. ఈసైన్య

ములోనుండువారు ఏసమయమున నెవ్వరువత్తురో అని ఎదురు చూచుచుందురు.

మన దేశము చాలగొప్పది. ఆంగ్లేయుల రాజ్యమునకన్న నెన్నియోరెట్లు పెద్దది. ఇచట ముప్పదికోట్ల జనులున్నారు. వీరినందఱిని వైస్‌రాయి ఒక్కఁడే పాలించఁగలఁడా? కనుక ఈహిందూదేశమును కొన్నిభాగములుగా భాగించియున్నారు. ఒక్కొక్కదానికి ఒక రాజ్యభాగమనిపేరు. వానిలో మన చెన్నరాజధాని యొకటి.

ఒక్కొకరాజధానికిని ఒక "గవర్నరు" అధికారి. అతనినికూడ మన చక్రవర్తిగారే నియమించెదరు. ఈగవర్నరు కూడ ఇంగ్లండు దేశమునుండియే వచ్చును. ఇతఁడును వైస్‌రాయివలెనే రాజ్యభాగమును ఐదేండ్లు పాలించి తమ దేశమునకు మరలిపోవును. చెన్నరాజధానికి అధికారియైన గవర్నరు మదరాసు (చెన్నపట్టణము) నందుండును. ఇతడుకూడ తన ఇష్టముచొప్పున చేయఁగూడదు. ఇతనికిని రెండు సభలున్నవి. వానియందు ఆంగ్లేయులును, స్వదేశీయులును కలరు. స్వదేశీయులలోఁ గొందఱు జనులచే నెన్నుకొనఁబడినవారలే! రాజ్యభాగమును పాలించుటలో వీరు గవర్నరునకు సహాయము చేయుదురు. గవర్నరునకుఁగూడ మన దేశపు వరమానము నుండియే జీతమియ్యబడును.



గవర్నరు ఒకఁడే రాజ్యభాగమునంతయు ఎట్లు పాలించును? ఒక్కొక్క రాజ్యభాగమును అనేక జిల్లాలుగ భాగించినారు. ఒక్కొక్కజిల్లాకును ఒక "కలెక్టరు" అను ఉద్యోగస్థుని నియమించినారు. వీరిలో ననేకులు ఆంగ్లేయులే! వీరు ఇంగ్లండులో గొప్పపరీక్షనిచ్చి, దానియందుఁ గడతేరినందున ఈయుద్యోగములకు నియమింపబడెదరు. మన జనులుకూడ ఇంగ్లండు దేశమునకుపోయి అక్కడ పరీక్షలో కృతార్థులైన యెడల వారికి గొప్పపనులు కావచ్చును. ఇట్లు సీమకుపోయి వచ్చినవారు కొందరు కలెక్టరులుగనున్నారు. వీరు ఒకజిల్లాకు గవర్నరు ఉండినట్లు.

ఈ కలెక్టరుగారిక్రింద అనేకులు స్వదేశీయులు డెప్యూటీ కలెక్టర్లుగను, తహశీల్దార్లుగను నున్నారు. ఒక్కొక్క తాలూకాకును ఒక తహశీల్దారున్నాడు. రెండు మూడు తాలూకాలకు పై యధికారి డెప్యూటీ కలెక్టరు. ఒక్కొక్క తహశీల్దారు చేతిక్రిందను యెందఱో గ్రామనౌకర్లు (రెడ్లు, కరణములు) కలరు. రయితులనుండి న్యాయముగా శిస్తు (భూమిపై పన్ను) వసూలుచేయుట మొదలైన పనులలో వీరందఱు కలెక్టరుగారికి సహాయముగానుందురు. వీరందఱు ప్రజాసేవకులే. వీరి పనిని తనిఖీచేయుటకై కలెక్టరుగారు అప్పుడప్పుడు జిల్లాయందంతయుఁ బ్రయాణము సేయుచుండెదరు. మనజిల్లాకలెక్టరుగారిని మీ రెప్పుడైన చూచినారా?

ఒక రాజ్యమును పాలించుట చాలకష్టము. జనుల క్షేమమునకై ఎన్నియో పనులుచేయవలయును. ఆపనులను వేర్వేరుగ భాగించి ఒక్కొక్క భాగమునకును కొందఱు నౌకర్లను నియమించినారు. ఒక్కొక్క పనిచేయువారికిని ఒక యిలాఖా (డిపార్టుమెంటు) వారని పేరు. సాధారణముగా నన్ని యిలాఖాలయందును పైయధికారులు ఆంగ్లేయులే! వీరందఱును గొప్పగొప్ప పరీక్షలలోఁ గృతార్థులైయుందురు.

జనులలోఁ గలతలు కలుగక సుఖముగానుండుటకు పోలీసు ఇలాఖావారును, వ్యవసాయమునకై చెఱువులు కాలువలు త్రవ్వుట మొదలగు యుపయుక్తమైన పనులను చేయుటకును, రాకపోకలకు మంచిబాటలను వేయించుటకును ఇంజనీయరింగు ఇలాఖావారును కలరు. వీరు శిల్పశాస్త్రమును చక్కగా చదివినవారు. జనులు రోగములచే బాధపడుచున్న వారికి చికిత్సచేయుటకు వైద్యులు (డాక్టర్లు) కలరు. వీరు వైద్యశాస్త్రమును చక్కగా నభ్యసించినవారు. జనులకు విద్య నేర్పుటకు విద్యాయిలాఖా వారున్నారు. ఈయిలాఖాల వారందఱు వైస్రాయిగారికి లోబడినవారే!

ఇప్పుడు మన దేశము ఉండురీతి యిది. పూర్వము మన జిల్లాయెట్లుండెనో, అప్పుడు ఎవ్వరు పాలించుచుండిరో, ఎట్లు



పాలించుచుండిరో, అప్పుడు జనులుఎట్లుండిరో మీరు, ముందు వచ్చు కథలలోఁ జదివెదరు. పూర్వము ఒక్కొక ఊరును ఒక బలవంతునిచే పాలింపఁబడుచుండెను. ఆయూరిపై శత్రువులు రాకుండునట్లు కోటలు కట్టి రాత్రులయందు కోటవాకిలి మూయుచుందురు. అట్టికోటలు ఇప్పటికిని అక్కడక్కడ పల్లెలలో కనఁబడును. ఇట్టి బలవంతులకే పాళెగాండ్రు అని పేరు. కొన్నికొన్ని గ్రామములు ఒక్కొక్క పాళెగానికి చేరి యుండెను. ఒకడు మఱియొకని ప్రదేశమును తీసికొనుటకు ప్రయత్నించుచుండెను. అందుచేత పలుమారు పాళెగాండ్రు ఒకరితో నొకరు పోట్లాడుచుండిరి. కనుకనే ఆ కాలమున ఇప్పటివలె జనులకు నెమ్మదియుండలేదు. అప్పటిలో తనకు పై అధికారి లేడు గనుక పాళెగాడు తన యిష్టమువచ్చిన చొప్పున జనులను పాలించుచుండెను. అట్టి పాళెగాండ్ర కథలను కొన్నిటిని మీకు తెలిపెదను. వీరిలో కొందఱు జనుల సౌఖ్యమును కోరి క్రమముగ రాజ్యము నేలుచుండిరి. కొందఱు తమ లాభమునకుగాను పాటుపడుచు జనుల కష్టములను సరకుగొనకయుండిరి. వారు చేసిన కార్యములనుచూచి వారెట్టివారో మీరే తెలిసికొనుఁడు.



# 3. చిక్కప్ప.

—:o:—

అనంతపురమునకు సమీపమున దేవరకొండ అనునొక పర్వతము కలదు. పూర్వకాలమున ఆ దేవరకొండకు కొంత దూరమున ఓరూరు అను గ్రామము ఉండెను. ఆగ్రామమున డాకరాజ అను బ్రాహ్మణుఁడు వాసము చేయుచుండెను. అతఁడు నందవరీకుఁడు. అతనిభార్య మేళమ్మ. వీరికి చిక్కప్ప అనునొక కుమారుఁడుండెను. వీరు కడు బీదలు. ఆ బాలునికి ఐదు సంవత్సరములు కాగానే వాని దురదృష్టము వలన తండ్రి చని పోయెను.

పిదప మేళమ్మకు ఏమిచేయుటకును తోచలేదు. కుమారుఁడు పసివాఁడు. అప్పుడు తుంగభద్రా నదీతీరమున విజయ నగరము అను పట్టణముండెను. ఇప్పుడు బళ్ళారిజిల్లా యందుండు "హంపి" అనునదే పూర్వము విజయనగరముగా నుండెను. అప్పుడు అచ్చట బుక్కరాయలు అనురాజు పాలించుచుండెను. ఆతఁడుచాల దయగలవాఁడని మేళమ్మ వినెను. కనుక ఆమె తన కుమారుని పిలుచుకొని విజయనగరమునకుఁ బోయెను.

ఒకనాడు తన కుమారుని ఒక దేవాలయము దగ్గర పరుండఁబెట్టి, ఆమె భిక్షమునకై గ్రామములోని జనుల ఇండ్ల



కడకుఁబోయెను. ఆ బాలుఁడు పరుండిన చోటికిదగ్గరనే ఒక పాముపుట్ట ఉండెను. ఆపుట్టయందుండిన పాము బయటికివచ్చి తన పడగనువిప్పి ఆ బాలుని ముఖమునకు ఎండతగులక పడగను అడ్డము ఉంచెను. ఆహా! క్రూరస్వభావముగల సర్పము ఇట్లుచేయుట అరుదుగదా? దీనినంతయుఁ గొంతదూరమున నున్న నాగభోగి అను పాములవాఁడు చూచుచుండెను. కొంతకాలమైనపిదప పాము పుట్టలోనికిఁ బోయెను. అది ఆ బాలునికి ఎంతమాత్రమును హాని కలుగఁజేయలేదు. ఆ పాములవాఁడు, బాలుఁడు మేలుకొనిన పిదప వానిని ఆలింగనము జేసికొని "బాలుఁడా! నీకు గొప్పపదవి లభించును. నీవు మంచి యదృష్టశాలివి. నామాటలే నిజమైన నీవు నాకేమి ఇచ్చెదవు." అని యడిగెను. అప్పుడు చిక్కప్ప "నేను గొప్ప పదవికి వచ్చిన నీపేరిట తటాకములను త్రవ్వించి వాని చెంత గ్రామములను కట్టించెదను" అని చెప్పెను. తన కీర్తియు పేరును శాశ్వతముగా నుండునుగదాయని సంతసించి పాములవాఁడు వెడలిపోయెను.

చిక్కప్ప దినములు కడచిన కొలఁదిని పెద్దవాఁడగుచుండెను. అపుడు బుక్కరాయలవద్ద నారాయణప్ప అనునతఁడు మంత్రిగానుండెను. మేళమ్మ తనకొమారుని నారాయణప్పగారి యింట కొలువునకు ఉంచెను. మంత్రి చెప్పిన పనులను మిక్కిలి శ్రద్ధతోను భక్తితోను చేయుచు, చిక్కప్ప వారి

యింటనే యుండెను. చిక్కప్ప మంచి తెలివిగల వాఁడు. మంత్రి యితని తెలివి తేటలనుగాంచి ఆశ్చర్యపడెను. అతనికి చిక్కప్పపై చాల నమ్మకముండెను. మంత్రి ఆతనికి విద్య చెప్పించెను. అప్పుడప్పుడు చిక్కప్పను రాజనగరునకు గూడ పిలుచుకొని పోవుచుండెను.

ఒకనాడు అర్ధ రాత్రమున ఢిల్లి చక్రవర్తి గారినుండి బుక్కరాయలకు ఏదో ఒకజాబువచ్చెను. అచట ఆవేళయందు దానిని చదివి చెప్పువారు ఎవ్వరు నుండలేదు. ఎవ్వరినైన పిలుచుకొనిరండని రాజు తనపరిచారకులకు ఉత్తరవు చేసెను. వారికి ఎవ్వరును కనబడరైరి. అప్పుడు వారు మంత్రి గృహమునకు ఎదుట పండుకొని నిద్రించుచున్న చిక్కప్పను మేలుకొల్పి పిలుచుకొని పోయిరి.

అతఁడు దానిని చదివి చక్కగా అర్థము చెప్పెను. రాజు అతనిని చూచి చాల ఆశ్చర్యపడెను. మరుసటి దినము ఆ జాబునకు బదులు వ్రాయవలయునని ఆలోచింపగా రాజునకు చక్రవర్తిగారి జాబు చిక్కలేదు. ఉద్యోగస్థులు ఆజాబును చూచినగాని బదులు వ్రాయలేమనిరి. ఎక్కడ వెతకినను ఆ జాబే చిక్కలేదు. అప్పుడు రాజు చిక్కప్పను పిలిపించి "ఆ జాబు నందుండిన విషయములు నీకు జ్ఞాపకమున్నవా ?" అని అడిగెను. అప్పుడు అతఁడు "అంతయును జ్ఞాపకమున్నది" అని



దానియందు వ్రాసియుండిన విషయములను పూస గ్రుచ్చినట్లు చెప్పెను.

మరుసటి దినము చక్రవర్తిగారి జాబు బుక్కరాయల పడకటింటిలో మిద్దెకు చెక్కబడియుండెను. దానిని తీసి చదువగా చిక్కప్ప చెప్పిన ప్రతి వాక్యమును సరిగానుండెను. అప్పుడు అందఱును చిక్కప్ప సామర్థ్యమును చాల మెచ్చుకొనిరి. అపుడు రాజు చాల సంతోషించి చిక్కప్పకు "వడయర్" అను బిరుదము నిచ్చి అతనిని నొక మంత్రిగా నియమించెను. బాలులారా! చాల విశ్వాసముతోను, శ్రద్ధతోను, భక్తితోను, చెప్పినపని చేయుచు బాగుగ చదువుకొనుచుండినందునగదా, చిక్కప్పకు అట్టి మంత్రి పదము లభించినది. కాన మీరును సోమరులై యుండక చిక్కప్పవలె శ్రద్ధతో మీ పనులను చేయుఁడు.

ఒకమారు బుక్కరాయుఁడు రాజ్యమును చిక్కప్పకు అప్పగించి తాను దండయాత్ర వెడలెను. రాజులేని కాలమున చిక్కప్ప రాజ్యమును ఎంతో నేర్పుతో ఏలుచుండెను. రాజు మరల విజయనగరమునకు వచ్చెను. అప్పుడు చిక్కప్ప చక్కగ రాజ్యము చేసినందులకై చాల మెచ్చుకొని అతనితో "నీకు ఇష్టమైన దేదియైన వేడుము, ఇచ్చెదను" అని చెప్పెను, అపుడు చిక్కప్ప "నాకు గ్రామములను కట్టించుటకును,

చెఱువులను త్రవ్వించుటకును బొక్కసములోని ధనమును యియ్యవలెను" అని అడుగగా రాజు సంతోషముతో ధనము నిచ్చెను. అప్పుడు చిక్కప్ప తూర్పుగా వెళ్ళి రెండు కొండల నడుమ ఒక చెఱువును, గ్రామమును కట్టించి దానికి పాముల వాని పేరట "నాగ సముద్రము" అని పేరు పెట్టెను. ఈ గ్రామము ఇప్పటికిని గుత్తితాలూకాలో నున్నది.

పిదప తన స్వగ్రామముండిన దేవరకొండ దగ్గర ఒక పెద్ద చెఱువును కట్టించి దానిచెంత రెండు గ్రామములను కట్టించెను. అందులో నొక గ్రామమునకు తన రాజుగారి పేర "బుక్కరాయ సముద్రము" అనియు రెండవదానికి రాణి గారి పేర "అనంత సాగరము" (అనంతపురము) అనియు పేరు పెట్టెను. ఆ దేవరకొండమీద నొక దేవాలయమును కూడ కట్టించెను. మన జిల్లాకు ముఖ్యపట్టణముగ నుండునది ఈ అనంతపురమే.

## 4. ముసలమ్మ మరణము.



బాలులారా! ప్రక్క పుటయందున్న బొమ్మను చూచితిరా? దానికి ముసలమ్మ కట్టయని పేరు. ముసలమ్మ ఎవర్తో మీ రెఱుగుదురా? అనంతపురమునకు చేరువ బుక్కరాయ సముద్రము అనునొక చిన్న గ్రామమున్నది. యీ రెండు



ముసలమ్మ కట్ట (అనంతపురము).

గ్రామములను ఏని చెంతనుండు చెఱువులను చిక్కప్ప వడయర్ అనునతఁడు కట్టించెనని మీరు చదివితిరి గదా? బుక్కరాయల యనుమతి చొప్పున చిక్కప్ప అనంతపుర సంస్థానమును పాలించుచుండె. ఈ అనంతపుర సంస్థానము విజయనగరమునకు చేరినదే! చిక్కప్ప బుక్కరాయ సముద్రముననే నివసించుచుండెను.

ఈ బుక్కరాయ సముద్రముననే ముసలమ్మ కాపురముండెను. ఆమెది కాపు కులము. ఆమెనుగురించి ఒక కథ కలదు. ఒకానొకనాడు విశేషవర్షము వచ్చినందున బుక్కరాయ సముద్రము చెఱువునిండి మరవ పాఱుచుండెను. అయితే నీళ్ళు ఎక్కువగా వచ్చియున్నందున చెఱువుకట్ట తెగునేమో అని జనులు భయపడ సాగిరి. చెఱువుకట్టకు గుమ్మడపడిన గ్రామమంతయు కొట్టుకొని పోవలసినదే! పాపము, ఊరివారందఱు ఏమి చేయను తెలియక యుండిరి.

అప్పుడు అమఱవ పారుటను చూచుటకు వచ్చియుండిన ఒక ఆమెకు పైనిండెను. ఆమె అక్కడ నుండినవారితో నిట్లు చెప్పెను. "నేను గంగాభవానిని. మీ యూరిలో నుండువారిలో నెవ్వరినైన ఒకరిని నాకు బలి యియ్యవలెను. లేనియెడల మీ గ్రామమును పాడు చేసెదను."

అప్పుడు ఆ యూరి వారందఱు దుఃఖ పడసాగిరి. అందఱికిని తమతమ ప్రాణములపై నాశయుండును. ఎవ్వరైన ప్రాణములను పోగొట్టుకొనుటకు ఒప్పుకొందురా? బలి యియ్యకుండినచో గ్రామమంతయుఁ గొట్టుకొని పోవును. పాపము వారికప్పుడు ఏమిచేయను తోచనేలేదు.

ఇట్లుండగా ఆయూరిలో బసిరెడ్డి అని యొక పెద్దమనిషి యుండెను. ఆయనకు ఏడుగురు కోడండ్రుండిరి. కడగొట్టు కోడలే ముసలమ్మ.

ఈ ముసలమ్మ ఊరిలోనుండు వారందఱు దుఃఖపడడము చూచెను. ఎవ్వరినైన బలి యియ్యకుండిన గ్రామములో నుండు ముసలివారు, బాలురు, స్త్రీలు అందఱును చని పోయెదరు గదా అని చింతించుచుండెను. పిదప ముసలమ్మ తన ప్రాణమునే యిచ్చుటకు నిశ్చయించుకొనెను. అక్కడ నుండినవారితో "నేను సిద్ధముగ నున్నాను. నన్ను బలి యియ్యండి" అని ధైర్యముగాఁ బలికెను. ఇతరుల క్షేమమున కై యెవ్వరు తమ ప్రాణముల నిత్తురు.

పాపము ముసలమ్మ తన మామయైన బసిరెడ్డి కాళ్లకు మ్రొక్కి, అందఱితోను సెలవు గైకొని చెఱువు దగ్గఱకు పోయెను. అందఱును ఆమెను చూచి ఏడ్చువారే! అందఱును ఆమెయొక్క సుగుణములను పొగడు వారే! ఆమె వెనుక ఆ



యూరి వారందఱును గుంపులు గుంపులుగ వచ్చుచుండిరి.

ఆ చెఱువు కట్ట ఒకచోట సందువిడిచి గుమ్మడి పడుటకు సిద్ధముగా నుండెను. ముసలమ్మ ఆసందులో కూర్చొనెను. ఆ జనులు ఆపెమీద రాళ్ళను, మన్నునువేసి కట్టను భద్రము చేసిరి. ముసలమ్మ చావునకై అందఱును కన్నీళ్ళు కార్చుచు తమతమ ఇండ్లకు పోయిరి. చెఱువు కట్ట భద్రముగా నిలచెను. నీళ్ళు గ్రామములోనికి రానేలేదు. ఊరి వారందఱును సౌఖ్యముగా నుండిరి.

ఆ ముసలమ్మ పేరు అందఱికిను జ్ఞాపకముండుటకే ఈ కట్టను కట్టినారు.

ఈ కథయందు నిజమెంతనో మనకు తెలియదు. కాని ముసలమ్మ తన గ్రామమునందు జనులకై తాను ఎక్కువ కష్టమునకు పాల్పడి యుండెననుట నిజమని తోచుచున్నది.

ఈ ముసలమ్మ చావునుగురించి మ॥రా॥రా॥శ్రీ, కట్టమంచి రామలింగారెడ్డి అనువారు ఒక చిన్న పుస్తకమును వ్రాసినారు. మీరు కొంచెము పెద్దవారైన పిదప దానిని కూడ చదువవచ్చును.

—:0:—

# 5. హండె అనంతపురము.

——:o:——

తుంగభద్రా నదిగట్టున విజయనగరమను పట్టణము ఉండెనని చదివితిరి. అది యొక గొప్ప రాజ్యమునకు ముఖ్య పట్టణము. ఈరాజ్యమును శ్రీరంగరాయలు అనురాజు పాలించుచుండెను. శ్రీరంగరాయలు ముఖ్యపట్టణమును విడిచి సంచారము వెళ్ళియుండెను. అప్పుడు మహమ్మదీయ రాజులు ఉత్తరమునుండి విజయనగరమును జయించుటకుగాను సైన్యముతో వచ్చిరి. ఈ సమాచారమును శ్రీరంగరాయలు ఎట్లో విని తత్క్షణమే అన్ని పనులను విడిచి బుక్కరాయ సముద్రమునకు వచ్చెను.

అప్పుడు బుక్కరాయ సముద్రమున మలకప్పనాయుడు రాజ్యము చేయుచుండెను. మలకప్పనాయుడు శ్రీరంగరాయలకు లోబడినవాడే. కనుక మలకప్ప తన సైన్యముతో శ్రీరంగరాయనికి సహాయము చేయుటకై బయలుదేరెను. మహమ్మదీయులకును, హిందువులకును గొప్పయుద్ధము జరిగెను. ఆ యుద్ధమునందు శ్రీరంగరాయలకే జయము కలిగెను.

పిదప మలకప్ప రాయలవారి సెలవుగైకొని బుక్కరాయ సముద్రమునకు వచ్చెను. యుద్ధమునందు ఓడిపోయిన మహమ్మదీయులకు ఎట్లయిన హిందువులను ఓడింపవలయునని



మనసులోనే బాధించుచుండెను. కాబట్టి ఆ మహమ్మదీయులు మరల గొప్పసైన్యముతో విజయనగరమునకు వచ్చిరి. పాపము శ్రీరంగరాయలు వారదెబ్బకు తాళలేక పోయెను. ఆయన యుద్ధములో ఓడిపోయి శత్రువులచేతికి జిక్కెను.

విజయనగర రాజ్యమంతయు మహమ్మదీయుల పాలాయెను. పెనుకొండ మొదలు తుంగభద్రానది వఱకు మహమ్మదీయులే పాలింపసాగిరి. మలకప్పనాయుడు ఈ సమాచారమువిని చాల దుఃఖించెను. అయిన నేమి సేయఁగలఁడు? మహమ్మదీయులు చాల బలవంతులు. వారిని ఓడించి శ్రీరంగరాయలను విడిపించుటకు శక్తిచాలలేదు. కనుక మహమ్మదీయుల మాటప్రకారము రాజ్యముచేయుచు వారి మాటను జవదాటక విశ్వాసముతో వారిని కొలుచుచుండెను. మహమ్మదీయులు మలకప్పయొక్క విశ్వాసమునకును, స్వామిభక్తిని మెచ్చి బుక్కపట్టణము, అనంతసాగరము, (ఇప్పటి మన యనంతపురము) యీ రెంటిని వాటికి చేరిన గ్రామములను యిచ్చి "పాదుషహా వజీరా" అను బిరుదునుకూడ యిచ్చిరి.

బాలులారా! మలకప్ప తనప్రభువులను భక్తి విశ్వాసములతోఁ గొల్చినందులకు అతని కింత మర్యాద జరిగినది? పాపము మలకప్పకు ఎంత రాజ్యముండిన నేమి? ఆయనకు సంతోషములేదు. ఎందుకనగా అతనికి సంతానము లేకుండెను. అతఁడు తనరాజ్యమును ధనమును ఎవ్వరికి విడిచి పోవలెను?

ఒకనాడు మలకప్ప స్వారిచేయుచుండి అనంతపురమున దిగెను. అచట ఎల్లారెడ్డి అనువతఁడు కాపురముండెను. ఎల్లా రెడ్డి ప్రభువుల రాక విని అతి సంరంభముతో వారిని తన యింటికి పిలుచుకొనిపోయి తగిన మర్యాదలను జరిగించెను. మలకప్పగారు అక్కడ ఎంతో ముద్దుగా యింటినిండను ఆట లాడుచుండిన ఎల్లారెడ్డి బిడ్డలను చూచి చాల సంతోష పడెను. తానును ఆయింటిలో కాపురముండిన తనకును సంతా నము కలుగునని అతనికి ఒక నమ్మకము కలిగెను. వెంటనే మలకప్ప ఎల్లారెడ్డికి తన యిష్టము తెలియఁ జేసెను. ప్రభు వుల మాటను ఎల్లారెడ్డి నిరాకరించునా? తక్షణమే దానికి సమ్మతించెను.

కొంతకాలమునకు మలకప్పగారు ఎల్లారెడ్డి యిల్లుండినచోట ఒక గొప్ప మందిరమును కట్టించి తన భార్యలతో ప్రయాణమై బుక్కరాయ సముద్రమును వదలి అనంత సాగరముననే నివసించుచుండెను. మలకప్ప హండే హనుమప్ప మనుమఁడు. వీరు హండే వంశమువారు.

కనుక అప్పటినుండియు నీ అనంతపురమునకు "హండే అనంతపురము" అనిపేరు. కొన్ని దినములకు పిదప మల కప్పగారి పట్టపు భార్యయైన శిద్దరామమ్మకు దేవప్ప, చిన్న రామప్ప, లింగప్ప, హంపానాయుడు అను నలుగురుకొమాళ్లు



కలిగిరి. అప్పటినుండియు మలకప్ప చాల సంతోషముతో నుండెను. చాల దినములనుండి కోరినకోరిక ఆనాడు పండెను. తన రాజ్యమును నలుగురు కొమారులకును పంచిపెట్టి అతఁడు చని పోయెను. కడపటి కుమారుఁడైన హంపానాయునికి అనంతపురము, బుక్కసాగరము, బుక్కపట్టణము, ధర్మవరము యీ ప్రాంతములు వచ్చెను.

---

## 6. వసంతమ్మ.

అనంతపురమున మఱియొకప్పుడు ప్రసన్నప్పగారు ఏలుచుండిరి. అప్పుడు వసంతమ్మ, లక్ష్మమ్మఅను నిరువురు స్త్రీలు తాడిమఱినుండి అనంతపురమున కేతెంచిరి. వీరిరువు రును కడుబీదలు. ఒకపూటకైన తినుటకు ఆహారము లేకుం డెను. కూలిచేసి ఎట్లో తమపొట్ట నించుకొనుచుండిరి. ప్రసన్నప్ప బీదలపై చాల దయగలవాడు. తన నగరునందలి మజ్జిగను అడిగినవార లందఱికిని పోయునట్లు ఉత్తరవు చేసియుండెను. పసిపిల్లలు గలవారలకు పాలు సయితము పోయునట్లు చెప్పి యుండెను.

వసంతమ్మ కూడ ప్రతిదినమును మజ్జిగకై రాజ నగరునకు బోవుచుండెను. వసంతమ్మ చాల సౌందర్యవతి. ప్రసన్నప్పగారు ఆమెనుచూచి, ఆమె సమాచారమంతయు నడిగి ఆమెను తన నగరున నుంచుకొనుటకు నిశ్చయించెను. వసంతమ్మయు నందులకు సమ్మతించెను. ఆమెకు ఒక యిల్లుకట్టించి అన్న వస్త్రాదులను ప్రసన్నప్పగారే యిచ్చుచుండిరి.

ఇట్లుండగా వసంతమ్మకు లభించిన సౌఖ్యమునుచూచి లక్ష్మమ్మ ఓర్వలేక తాడిమర్రికి మరలి పోయెను. అక్కడ అపుడు పెద్ద తిరుమలనాయుడు పాలించుచుండెను. లక్ష్మమ్మ అతనిని ఆశ్రయించెను. ఒకనాడు లక్ష్మమ్మ వసంతమ్మకు ఇట్లు జాబువ్రాయించెను. "చెల్లెలా! నీకు ఎంత సౌఖ్యముగా నుండిననేమి? నీవు ఒకరి అధీనమున నున్నావు. అది చాల నీచమైనది. మనము ఎప్పుడును స్వతంత్రముగా నుండవలెను. కనుక నీవు నామాట వినిన మనము స్వతంత్రముగాను, సౌఖ్యముగాను ఉండవచ్చును. మంచి సమయముచూచి రాజును మొదట నమ్మించి యెట్లయిన నక్కడనున్న సొమ్మంతయు తీసికొని రాజునకు మోసముచేసి యిక్కడకు రావలయును. నీ అక్కమాట వినుము. నేను నీ మేలునే కోరి చెప్పుచున్నాను." వసంతమ్మ మనసు యీజాబునుచూచిన తక్షణమే మారి పోయెను. తన అక్క తనకు నిజముగా మేలు చేయుచున్నదని నమ్మెను. అదియునుగాక రాజు తనయందు



చాల నమ్మకము ఉంచియుండెను. కనుక మోసముచేసి చాల ధనమును తీసుకొని పోవచ్చునని ఆమెకు ఆశకలిగెను. వెంటనే ప్రసన్నప్పను మోసము చేయవలయునని మనసులో దృఢపఱచుకొనెను.

వెంటనే వసంతమ్మ "కొంత సైన్యముతో అనంతపురము చెఱువుకడనున్న దేవరకొండకు రావలయును" అని తన అక్కకు ఒక జాబువ్రాసి పంపెను. ఆమె ఆదేశప్రకారము దేవరకొండ వద్దదిగి తన చెల్లెలకు చెప్పిపంపెను. అపుడు వసంతమ్మ ప్రసన్నప్పగారితో "మా అక్క లక్ష్మమ్మ వెంకటేశ్వరుని దర్శనార్థమై యీ దేవరకొండ కేతెంచినది. నేను ఆమెను చూచి చాల దినములైనది. నేను ఈ దినము ఆమెను చూచి వచ్చుటకు నాకు వుత్తరవు ఇయ్యవలెను' అని అడిగెను. ప్రసన్నప్ప వెంటనే సమ్మతించెను. వసంతమ్మ కొందఱు మనుష్యులను పిలుచుకొని బయలుదేరెను. వారు కొంత దూరము పోయిన తరువాత ప్రసన్నప్పకు ఎందుచేతనో అనుమానము కలిగెను. కనుక వారిని వెనుకకు రప్పించి "ప్రొద్దున నే పోవచ్చును. ఇప్పుడు పోవుట నాకు ఇష్టములేదు" అని చెప్పెను. వసంతమ్మకు అప్పుడు భయము కలిగెను. తప్పు చేసిన వారికి వారి తప్పు బయట పడునేమో అని ఎప్పుడును భయమే! అప్పటినుండియు ఆమె మనసు ఎట్లోయుండెను.

ఆ రాత్రి ప్రసన్నప్ప పండుకొని నిద్రపోవుచుండెను. అప్పుడు వసంతమ్మ అక్కడనున్న ధనము నంతయు మూటగట్టుకొనియుండెను. తెల్లవారిన తనకు ఏమియో హాని కలుగునని ఆమె నిశ్చయించుకొనెను. కనుక అచటనుండిన నొక బాకును తీసుకొని ప్రసన్నప్ప గొంతును కోసెను. వెంటనే ధనమును తీసికొని బయటికిపోయి పరుగెత్తిపోవఁ జూచెను. కాని ఆమెకు కండ్లు కానరాలేదు. అంతలోనే అక్కడ నుండిన కావలి వాండ్రు ఆమెను పట్టుకొనిరి. వారు లోపలికి వచ్చిచూడగా రాజు చనిపోవు స్థితిలో నుండెను. ప్రసన్నప్ప తన చేతితో వసంతమ్మ తట్టు చూపెను.

అప్పుడు వారు ఆమెను శోధించిరి. ఆధనము చిక్కెను. ప్రసన్నప్ప చనిపోయెను. వసంతమ్మను చెఱలో నుంచిరి. ఆమె అనేక కష్టములనుపొంది, అక్కడనే చనిపోయెను.

బాలులారా! చూచితిరా, వసంతమ్మ యితరుల ధనమున కాశపడి ఎటువంటి క్రూరమైన పనులను చేసెనో? తెలివిలేక తన అక్కమాటలను విని తనకు అన్న వస్త్రాదు లిచ్చిన స్వామినే చంపెను. అట్లుచేసిన దానికి తగిన శిక్షను పొందెను. తన ప్రాణమునే పోగొట్టుకొనెను.





# 7. పవాడప్ప నాయడు.

—:o:—

బాలులారా! మీరు మనజిల్లాయందుండు బుక్కపట్టణమును జూచియున్నారా? అచట యొక పెద్ద చెఱువున్నది. దానిగుండా చిత్రావతినది పారును. ఈ పట్టణమును దీనికి చేరిన గ్రామంబులను పవాడప్ప నాయుఁడు పాలించుచుండెను. ఈ పవాడప్ప ప్రసన్నప్ప తమ్ముఁడే! ప్రసన్నప్ప ఎట్లు చనిపోయెనో మీరు చదివితిరి. తన అన్న చనిపోయినది విని పవాడప్ప చాల వ్యసనపడెను. వెంటనే అతఁడు అనంతపురమునకు వచ్చి అచటనే రాజ్యము చేయుచుండెను.

ఇతఁడు రాజ్యము చేయుచుండఁగా కడప నవాబువద్ద కొలువున నుండిన మహమ్మదుఖాను, ఆలీఖాను, సర్దారు ఖాను అను సరదారులు తమ సైన్యముతో ఎచటికో పోవుచుండి అనంతపురమునకు చేరువనున్న జూటూరువంక దగ్గర దిగిరి.

ఈ కడప నవాబునకు ప్రతిసంవత్సరమును పవాడప్ప కప్పముకట్టవలసియుండెను. కనుక నవాబుయొక్క సరదారులు వచ్చియుండుటవిని తన మంత్రియైన రామాజీతోఁ గొంత ధనమునిచ్చి వారి యొద్దకుఁ బంపెను.

రామాజీ ఆ సరదారులను చూచి "పవాడప్ప తాగుబోతు. ఇప్పుడు ఈసంస్థానముయొక్క స్థితి యేమియు బాగుగలేదు. బొక్కసమున ద్రవ్యములేదు. మీరు కొంచము ధైర్యముతో ఇప్పుడే పవాడప్పగారిని బెదరించిన ఈ సంస్థానము మీదేయగును. పవాడప్పగారు మీ నవాబునకు నాలుగు సంవత్సరములనుండి కప్పము కట్టవేలేదు. ఈసాకుతో మీరు ఈ సంస్థానమును లాగుకొనవచ్చును. ఇక్కడ దండు కూడ ఎక్కువగ లేదు." అని చెప్పెను. ఆసరదారులు ఇదివిని చాల సంతోషించిరి. వారు రామాజీతో "నీవు పోయి మేము పవాడప్పగారిని చూచుటకు వచ్చుచున్నామని చెప్పుము" అని యాజ్ఞాపించిరి. రామాజీ కొంతకాలము కడపలోనుండెను కనుక ఈ సరదారుల నాతఁడు చక్కగా నెఱుగును.

పవాడప్ప యీ సరదారులను లోనికిఁ బిలిచి తగిన మర్యాదచేసెను. వారు పవాడప్పతో "మీరు నాలుగు సంవత్సరములనుండి కప్పము పంపలేదు. ఇప్పుడు ఆ మొత్తమును ఇచ్చినను సరే, లేక మా వెంట మానవాబు నొద్దకు మీరు వచ్చినను సరే. మా ప్రభువుల యుత్తరవైనది" అని చెప్పిరి.

అప్పుడు పవాడప్పకు యేమిచేయను తోచలేదు. ఇప్పుడు ద్రవ్యమునిచ్చుటకు సాధ్యముకాదు. మీ ప్రభువుల



యుత్తరమును చూపుడు. చూపినట్టయిన మీ వెంట కడపకు వచ్చెదను" అని పవాడప్ప చెప్పెను.

అప్పుడు సరదారులు "మామాటలయందు నీకు నమ్మకము లేక పోయినదా? మేము సమక్షము వచ్చియుండినను మా ప్రభుల యుత్తరవు కావలయునా? సరే, మీరు మా వెంట రానక్కరలేదు. కడచిన నాలుగు సంవత్సరముల రూకల నిచ్చి ఇచటినుండి లేచిపొండు" అని కోపముతో పలికిరి.

పవాడప్పగారిని అక్కడనుండి ఎక్కడికిని పోనియ్యక ఖైదీగానుంచిరి. అక్కడనే అతనికి అన్నము తెచ్చి వేయుచుండిరి. పాపము పవాడప్ప చాల దుఃఖపడుచుండెను. రామాజీ చేసిన ద్రోహము నాతఁడెఱుఁగఁడు.

ఈ సమాచారము క్రొత్తచెఱువునందుండిన నిడమామిడిస్వాములవారు ఎట్లో వినిరి. పవాడప్ప బుక్కపట్టణమున నున్నపుడు ఈ స్వాములపై చాలభక్తి గలిగియుండెను. వారు పవాడప్పను యెట్లయిన విడిపించవలయునని, నిశ్చయించుకొనిరి. వెంటనే వారు బుక్కపట్టణము, క్రొత్తచెఱువు నందలి జనులను వెంటబెట్టుకొని ఎవరికిని తెలుపక అనంతపురమునకు వచ్చిరి. అనంతపురమున నుండిన చెన్నబసప్పను పిలిపించి ఏకాంతమున నతనితో "మీ బావయైన పవాడప్ప

గారి సంస్థానము మునుగునట్లున్నది. ఇదియంతయు రామాజీ ద్రోహమే. మనము ఎట్లయిన నీ తురకలను పారఁద్రోలి పవాడప్పగారిని విడిపించవలయును.” అని చెప్పెను. వారిద్దరును చాలకాలము యోచించి బుక్కరాయ సముద్రము నందలి జనులనుకూడ పిలిపించి ఒక ఉపాయముచే తటాలున మహమ్మదీయులపైఁబడి యుద్ధముచేసి వారిని పారఁద్రోలిరి. చెన్నబసప్పయు, నిడుమామిడి స్వాములవారును చేసిన యుపకారమునకు పవాడప్ప చాల సంతోషించెను.

వెంటనే రామాజీ చేసిన మోసమును తెలిసికొని పవాడప్ప అతనిని బుక్కరాయ సముద్రములో నుండిన బురుజులో ఖైదీగానుంచెను. ఒకనాడు పవాడప్ప బుక్కరాయ సముద్రముతట్టు వేటకై పోయియుండి రామాజీని పిలిపించి అతనితో “రామాజీ, నీవంటి స్వామి ద్రోహి భూమిపై నెక్కడను లేడు. నా కొలువుననుండి నాకే కీడు దలంచితివి. నా యింటఁగుడిచి నన్ను మోసగించితివి. నీవు మర్యాదగలవాడవని నిన్ను నమ్మియుంటిని. అయినను దేవుని దయచే నీ యాటలు సాగలేదు. నిన్ను చూచిన పాపము వచ్చును. నీవు ఇంకను భూమిపై బ్రతుకుటకంటెను విషముద్రాగి చచ్చుట మేలు. నీవు చేసిన మోసమునకుఁ దగిన శిక్ష ననుభవింపుము.” అని పలికెను.



రామాజీ సహితము తన నోటికివచ్చినట్లు పవాడప్పను నిందించెను. పవాడప్పకు కోపమువచ్చి రామాజీ నాలుకను కోయించెను. నోరులేని బ్రతుకు బ్రతుకనొల్లక రామాజీ తన్నుతానే చంపుకొనెను. కటకటా! బాలులారా, చూచితిరా! తనకు మేలు చేసినవారికి మోసముచేసిన రామాజీ కడకు ఎటువంటి చావు చచ్చెనో? ఇతరులను చెడపగోరువారి నెల్లరను దైవము ఇట్లే శిక్షించును. కనుక ఎప్పటికిని ఇతరులను చెరుపఁ గోరకుడు.

పవాడప్ప బ్రాహ్మణుని చంపిన పాపమును పోగొట్టుకొనుటకై యాత్ర వెడలెను. కాని అతఁడు మార్గమునందే చనిపోయెను. అతని శరీరమును తెచ్చి క్రొత్త చెఱువునందు నిడుమామిడి స్వాముల మఠమున క్రీస్తుశకము 1737 సంవత్సరమున (అనగా నిప్పటికి 1,8 సంవత్సరముల క్రింద) సమాధి చేయించిరి.

---

## 8. శిద్దప్పనాయుడు.

---

పవాడప్ప చనిపోయిన తోడనే అతని కుమారుఁడైన శిద్దప్పకు క్రీ. శ. 1738-వ సంవత్సరమున పట్టము కట్టిరి. ఇతఁడు అప్పటికి బళ్ళారియందున్న రామప్పగారి భార్య

యొక్క చెల్లెలైన భద్రమ్మను వివాహ మాడెను. శిద్దప్ప త్రాగుబోతు. అదియునుగాక అతడు చాల దుర్మార్గుడు. ఇతడు జనుల కష్టములను కొంచెమైనను విచారించుచుండ లేదు. ఇంతేకాక వారిని చాల బాధపెట్టుచుండెను. పాపము ఆ జనులు ఎంతకాలము ఓర్చికొని యుండగలరు!

బుక్కరాయసముద్రమున నుండినవారును అనంతపురమున నుండిన వారును తమతమ గ్రామములను విడచి పారిపోవ నారంభించిరి. దుష్టులను చూచిన దూరమున నుండవలయును గదా?

మూడవ కథయందు ప్రసన్నప్పను వసంతమ్మ చంపెనని వింటిరి కదా? అప్పుడేకదా ప్రసన్నప్పగారి తమ్ముడైన పవాడప్ప అనంతపురమునకు వచ్చినది? ఆ ప్రసన్నప్పకు రామప్ప అను కుమారుడుండెను. తండ్రి చనిపోయినప్పటి నుండియు రామప్ప బళ్ళారిజిల్లా హొసపేట తాలూకాలో నుండు హొసూరున తన బంధువుల వద్దనుండెను. యీ రామప్ప చాల మంచివాడు. జనుల యెడల నెంతయో దయ! అయిన నేమి లాభము? ఆయనకు రాజ్యమే లేదు.

అనంతపురమునను బుక్కరాయ సముద్రముననూ ఉండిన కొందఱు పెద్ద మనుష్యులు హొసూరుకు బోయి రామప్పగారితో "దేవరా! మీరు మా గ్రామమునకు వచ్చి



మమ్ము కాపాడవలయును. శిద్దప్ప చాలదుర్మార్గుడు. మేము ఆయన బాధకు తాళలేము" అని విన్నవించిరి. రామప్ప అందులకు సమ్మతించెను.

ఈ సమాచారమును శిద్దప్ప యెట్లో వినెను. వెంటనే బొక్కసమునయున్న ధనమును ఆయుధములను తీసికొని కొందఱు జనులతో తాడిమరికి పోయెను. అప్పుడు తాడిమరి యందు పెద్దతిరుమల నాయుడు ఏలుచుండెను. అతనికి శిద్దప్పకును చాల స్నేహము. తిరుమల నాయుడు శిద్దప్ప రాజ్యమును విడచివచ్చినందులకు చాల దుఃఖపడి తనచేతనైన సహాయము చేయుటకు మాట నిచ్చెను.

రామప్పగారు హొసూరునుండి హాయిగ అనంతపురము చేరిరి. అక్కడ శిద్దప్పగారు లేనిదిచూచి చాలసంతోషపడిరి. అప్పటినుండియు రామప్పగారే రాజ్యము చేయుచుండిరి.

ఇట్లుండగా నొకనాడు శిద్దప్ప, తిరుమలనాయుని గొప్ప సైన్యముతో నేతెంచి అనంతపురమును ముట్టడించెను.

పాపము రామప్పగారికి ఏమిచేయుటకును తోచలేదు. బొక్కసములోని ధనమంతయు శిద్దప్ప తీసికొని పోయి యుండెను. సైన్యముకూడ చాలచిన్నది. దైవమే దిక్కని అతడు

ఊరకుండెను. అంతలో గుత్తి దుర్గమునందుండిన మురారి రాయఁడు మడకశిరాలో నున్నారని రామప్పగారు వినిరి. ఈ మురారి రాయనికిని రామప్పకును చాల స్నేహము. వెంటనే రామప్ప మురారి రాయనికి "మాగ్రామమును శత్రువులు ముట్టడించినారు. సంస్థానము మునుగు నట్లున్నది. తక్షణము వచ్చి కాపాడవలెను." అని జాబు వ్రాసి పంపెను.

మురారి రాయఁడు రామప్ప కోరిక ప్రకారము గొప్ప సైన్యముతో అనంతపురమునకు వచ్చెను. అపుడు శిద్దప్పకును మురారి రాయనికిని యుద్ధము జరిగెను. మురారి రాయని సైన్యమున మంచి ధైర్యవంతులుండిరి. కనుక శిద్దప్ప ఓడిపోయెను. రామప్ప శిద్దప్పను చెఱసాలయందుంచెను.

శిద్దప్ప అవమానమును తాళలేక అన్నమును నీళ్ళను కూడ విడచి పెట్టెను. ఆహారమును విడచి ఎన్ని దినములు బ్రతుకఁ గలఁడు? కొన్ని దినములలోనే అతఁడు చనిపోయెను. కొందఱు అతనిని రామప్ప చంపించెనందురు. కాని రామప్ప అట్టి పనిని ఎన్నటికిని చేయఁడు.





# 9. రామప్పనాయుడు.

---

రామప్ప ప్రసన్నప్ప కుమారుఁడు. రామప్ప పసివాఁడుగా నున్నప్పుడే ప్రసన్నప్ప చనిపోయెను. అతఁడెట్లు చనిపోయినది మీరిదివఱకే చదివియున్నారు. అనంతపురమున నుండిన యెడల దాయాది శిద్దప్ప వారికి హానిచేయునేమో యని జనులు భయపడిరి. తండ్రి చనిపోయినప్పటి నుండియు రామప్ప తన తల్లితో హానసూరు చేరెను. హానసూరు గ్రామమున ముద్దు మల్లప్పగారు వీరిద్దరిని తమ గృహమున నుంచుకొని కాపాడుచుండిరి.

రామప్పగారు శిద్దప్పగారినుండి ఎట్లు రాజ్యము సంపాదించినదియు మీరు ఎనిమిదవ కథలో చదివితిరి. శిద్దప్ప చనిపోయిన తోడనే అతని భార్య భద్రమ్మ రామప్పగారి సెలవుగైకొని తనఅక్కగారిని చూచుటకు బళ్ళారికి పోయెను. అప్పుడు బళ్ళారి నేలుచుండిన పెద్దరామప్ప భార్య శిద్దమ్మయే భద్రమ్మకు తోబుట్టువు.

భద్రమ్మ తన సమాచార మంతయు అక్కతో చెప్పుకొని యేడ్చెను. తన మగనిఁ జంపించిన రామప్పను ఎట్లయిన చంపించ వలయునని ఆమె పట్టుపట్టెను. బళ్ళారి పెద్దరామప్ప

కూడ భార్యమాటలువిని అనంతపురమున నున్న రామప్పను చంపఁగోరెను. పెద్దరామప్పగారి బావ మరదియైన జగ్గుల మల్లప్ప అనంతపురమున సైన్యాధిపతిగనుండెను. పెద్దరామప్ప తనకోరికను జగ్గుల మల్లప్పకుఁ దెలియఁజేసెను. అప్పుడు మల్లప్ప పెద్దరామప్పకు ఇట్లు వ్రాసి పంపెను. "మీకోరిక యీడేరుటకు మీరీ యుపాయము చేయవలెను. మీకు సంతతిలేదు. రామప్పగారికి పుత్రులున్నారు. ఒక పిల్లవానిని దత్తు తీసుకొనుటకు సమ్మతి యియ్యవలయునని రామప్పగారిని అడుగుఁడు. ఆ పిల్లవానికి మీ సంస్థానము పట్టముకట్టి రెండు సంస్థానములను ఒకటిగా నుండునట్లుచేయుట మీ యిష్టమని రామప్పకు పలుమారు వ్రాయుచుండుడు. అందువలన అతనికి మీయందు నమ్మకము కలుగును. తక్కిన పనులను నేను చేసెదను."

పెద్దరామప్ప మల్లప్ప చెప్పినట్లే చేసెను. పాపము అనంతపురముననున్న రామప్ప పెద్దరామప్ప చేయుచుండిన మోసము తెలిసికొనలేదు. కనుక తన కుమారుడైన శిద్ద రామప్పను బళ్లారికి పంపెను. ఆపిల్లవాడు అక్కడనేఉండెను. ఒక సంవత్సరమైన తరువాత రామప్ప బళ్లారికి పోయి తన కుమారుని జూచి వచ్చెను. అప్పుడు పెద్దరామప్ప వీరికెన్నియో బహుమానముల నిచ్చెను. అప్పటి నుండియు వారిద్దరికిని నమ్మకము హెచ్చెను.



ఇట్లుండగా పెద్దరామప్పగారు రామప్పగారిని చూచుటకు కొంత దండుతో ననంతపురమునకు వచ్చెను. ఈసమాచారమువిని రామప్ప తడకలేటి దగ్గరకుబోయి వారిని మర్యాదతో పిలుచుకొని వచ్చెను. పెద్దరామప్పగారిని నగరులో దించెను. పెద్దరామప్పగారి సైన్యమునకు కోటలో స్థలము లేకపోయెను. వేరుఊరు వారికి మర్యాద చేయవలయునని రామప్ప తనసైన్యమును కోటబయట కావలియుండుమని చెప్పి పెద్దరామప్పగారి సైన్యమును కోటలో నుంచెను.

రాత్రి నగరులో అందఱును నిద్రపోవుచుండిరి. పెద్దరామప్ప, మల్లప్ప వీరిద్దరును ఆలోచించి తమ నద్దనున్న నీలడు, గురువడు, అను వారలను పిలిపించి "కోటలో సైన్యము లేదు. ఉండునది మన సైన్యమే. ఈ రాత్రి యెట్లయిన రామప్పగారిని చంపితే ప్రొద్దున నీ సంస్థానము మనదే అగును." అని చెప్పిరి.

ఆ దుర్మార్గులు వారిమాటల ప్రకారమే చేసిరి. ప్రొద్దుననే రామప్ప చంపబడియుండెను. నగరిలో పండుకొని యుండిన పెద్దతిమ్మడు ఎట్లో తప్పించుకొని బయటికిపోయి "బళ్లారివారు మన రామప్పగారిని మోసముచేసి చంపిరి." అని అందఱికిని తెలియఁజేసెను.

పెద్దరామప్ప సైన్యముతో కోటలోనుండెను. కనుక బయటనుండినవారు ఏమియుచేయలేక పోయిరి. కనుక క్రీ శ. 1752 సంవత్సరమున అనంతపురము బళ్ళారి పెద్దరామప్ప పాలాయెను.

—:o:—

# 10. శిద్దప్ప.

బళ్ళారి పెద్దరామప్ప, అనంతపురము రామప్పగారి కొమారుఁడైన శిద్దరామప్పగారిని దత్తు దీసికొనియుండెను. రామప్పను చంపించిన తోడనే శిద్దరామప్పగారిని బళ్లారి కోటలో నొక చెఱసాలయందుంచిరి. పాపము గోరుచుట్టుపైన రోకటి పోటు. తండ్రిని చంపిరని దుఃఖించుచుండగా అతనిని కారాగృహమున నుంచిరి. అదియునుగాక శిద్దరామప్పగారి బావయైన బసవప్పనుకూడ కారాగృహమున నుంచిరి.

బసవప్ప మంచి పరాక్రమశాలి. అతిసమర్థుడు. ఏకాలమున నేమిచేయవలయునో అతనికి బాగుగ తెలుసును. కనుక అచట కావలియుండిన సేవకులతో కనికరము కలుగునట్లు తన కష్టముల నన్నిటిని బసవప్ప చెప్పెను. వారికి ధనము



కూడ నిచ్చునట్లు ఆశ పెట్టెను. పాపము ఆసేవకులుకూడ వీరి కష్టములనువిని కన్నీరుఁ గార్చిరి. కనుక శిద్దరామప్పను బసవప్పను అచటనుండి తప్పించుకొని పోవనిచ్చిరి.

'బ్రతికితిమి కదా, దైవమా' అని వీరిరువురును ఏదో ఒక త్రోవబట్టి పోవుచుండిరి. వారు ఎక్కడికి పోవుచుండిరో వారికే తెలియదు. వారు చాలదూరము పోయినవెనుక వారికి ఒక గ్రామము కనబడినది. అది బళ్ళారి తాలూకాలోనుండు హిరేహాళు. ఆగ్రామమున నుండిన శివప్ప వీరిని తన యింటిలో నుంచుకొని కాపాడుచుండెను.

ఇట్లుండగా బసవప్ప శివప్పగారి యుత్తరవుబొంది, రాప్తాడు, పెద్దవేముల, బుక్కపట్టణము, బండమీదిపల్లి, కూడేరు మొదలైన గ్రామములకు పోయి అక్కడి జనులతో రామప్పగారి కుమారుడైన శిద్దరామప్ప సంస్థానమును, పోగొట్టుకొని, పడుచుండిన కష్టములను వారికి దెల్పెను. రామప్పగారు చేసిన మేలును వారు మఱచియుండలేదు. అట్టి చల్లని ప్రభువుయొక్క కొమారుఁడు రాజ్యములేక కష్టములు పడుచుండుటవిని వారందఱు దుఃఖపడి, ఎట్లయిన బళ్లారి పెద్దరామప్పనుండి సంస్థానమును ఇప్పించవలయునని నిశ్చయించుకొనిరి.

వెంటనే అనేకులు బసవప్ప గారితో 'మేము సహాయము వచ్చెదము; మేము సహాయము వచ్చెదము' అని అనేకులు గుంపులు గుంపులుగ వచ్చిరి. కనుక వెంటనే బసవప్ప ఒక గొప్ప సైన్యమును చేర్చెను. పిదప అతడు గుత్తి మురారి రాయలకు సైన్యము పంప వలయునని ఒక జాబు వ్రాసెను. మురారిరాయుడు అదే ప్రకారము ఒక గొప్ప సైన్యమును పంపెను.

ఈ రెండు సైన్యములను ఒకటిగా చేర్చి బసవప్పగారు అనంతపురమునకువచ్చి బళ్లారి పెద్దరామప్పగారి సైన్యమును సులభముగా పారదోలి సంస్థానమును స్వాధీన పఱచుకొనెను.

వెంటనే యీ మంచి సమాచారమును హిరేహాళు నందున్న శిద్ధరామప్ప గారికి తెలియఁజేసిరి. అప్పుడు శిద్ధరామప్ప సంతోషముతో అమీను శివప్పగారికి వందనము చేసి అనంతపురమునకు బయలుదేరెను. శిద్ధరామప్పగారు అనంతపురమునకు వచ్చినపుడు జనుల సంతోషమునకు మేరయే యుండలేదు. వెంటనే శిద్ధరామప్పగారికి క్రీ. శ. 1753-వ సంవత్సరమున సంస్థానమును పట్టముఁ గట్టిరి. శిద్ధరామప్ప తనకు రాజ్యము సంపాదించి యిచ్చిన బసవప్పగారిని సైన్యాధిపతిగా జేసెను. పేరునకు మాత్రము శిద్ధరామప్ప రాజుగా నుండెను. కాని బసవప్పగారే కార్యముల నన్నిటిని నడపు చుండెను.



కొంతకాలమైన పిదప మురారి రాయలు ఇలీసుఖానునకు కొంత సైన్యమునిచ్చి అనంతపురమునకు పంపిరి. అప్పుడు ఇలీసుఖాను పదివేల రూపాయల నిచ్చినగాని అనంతపురము నుండి వెడలుట లేదని పట్టుపట్టెను. పాపము శిద్ధరామప్ప యేమి చేయగలడు? అప్పుడే క్రొత్తగా సంస్థానమును సంపాదించెను. బొక్కసములో ద్రవ్యము లేదు. ఇలీసుఖాను ఎంత చెప్పినను వినడు.

అపుడు నగరుననున్న ఎద్దులను, సామానులను, కొంత నగదు పైకమును, ఇలీసుఖాను వశము చేయవలసి వచ్చినది. అక్కడికిని నాలుగువేల రూపాయలయ్యెను. తక్కిన ఆరువేల రూపాయలకు ఏమి చేయవలయునని బసవప్ప యోచించు చుండెను. శిద్ధరామప్పగారికిని ఏమియు తోచలేదు. అప్పుడు విధిలేక గ్రామములోని జనులందరికిని దామాషా ప్రకారము పన్నులు వేసిరి. పాపము జనులు ఏమి చేయగలరు.? ఇయ్యకపోయిన మురారి రాయల సైన్యము గ్రామమును పాడుచేయుదురు. ఈ ఆరువేల రూపాయలను తీసికొని ఇలీసుఖాను ధర్మవరమునకు వెడలిపోయెను.

మురారి రాయల సైన్యము లేచిపోయిన కొన్నినెలలకే బలవంతరాయనివారు దండుతో వచ్చి అనంతపురమును ముట్టడించిరి. పాపము! ఈమహారాష్ట్రులతోడను, మహామ్మదీయుల

తోడను వీరికి ఎప్పుడును బాధలే! ఎప్పుడు పన్నులే!! రాజులు మాత్రము ఏమి చేయగలరు? శత్రువులు గొప్ప సైన్యముతో వచ్చి బెదరించెదరు. వీరిది చాల చిన్న సైన్యము. శత్రువుల సైన్యములో పదింట నొక భాగమైన నుండదు.

బసవప్పకు బలవంత రాయనితో నేమి చెప్పుటకును తోచలేదు. జనులు వారితోఁ బోరాడ జూచిరి, కాని వారిని పారద్రోలుట సాధ్యముకాక పోయెను. వెంటనే వారితో సమాధానము చేసికొన వలసి వచ్చెను. శిద్దరామప్పగారు బలవంత రాయనికి 50 వేల రూపాయల నిచ్చునట్లు మాట యిచ్చెను. నగరులోని నగలనమ్మి 14 వేల రూపాయలనిచ్చెను. తక్కిన రూపాయల నిచ్చువఱకు, బలవంతరాయలకు క్రొత్త చెఱువు గ్రామమును కుదువ ఉంచెను. మరుసటి దినమే దండు లేచి పోయెను.

కొంత కాలమైన పిదప బసవప్ప రాజ్యములోని భూములను సాగుబడి చేయించి శిస్తు వసూలుచేసి 36 వేల రూపాయలను బలవంతరాయలకు పంపెను. వెంటనే అతని జనులు క్రొత్త చెఱువును శిద్దరామప్పగారి స్వాధీనముచేసి వెళ్ళిపోయిరి.





# 11. తాడిపత్రి ముట్టడి

మన జిల్లాయందుండు పెద్ద ఊర్లలో తాడిపత్రి యొకటి. ఈ గ్రామముచెంత పెన్నానది పాఱుచున్నది. తాడిపత్రియందు వ్యాపారము విశేషము. ఇక్కడ అనేకులు వ్యాపారస్తులున్నారు.

పూర్వము ఈగ్రామమున రంగు గోవిందరాయుడని ఒకడుండెను. ఆయన వ్యాపారముచేసి చాల ధనము సంపాదించెను. ధనము కలవాడు కనుక అతని మాట అందఱును వినుచుండిరి. గుత్తిగ్రామమున మురారి రాయుడుండెనని మీరు చదివి యున్నారు గదా! అతనికిగూడ రంగు గోవిందరాయుడు వడ్డికి కొంత ధనము అప్పిచ్చియుండెను. కనుక మురారి రాయుడు తాడిపత్రి గ్రామమును విచారించుచుండు మని గోవిందరాయునికి ఉత్తరవు చేసెను. అప్పటినుండి గోవిందరాయఁడే తాడిపత్రిని మురారి రాయని పేర నేలుచుండెను.

అనంతపురమున శిద్దరామప్ప రాజుగా నుండినను బసవప్పగారే రాజ్యమును ఏలుచుండిరి గదా? రెండుమారులు మహారాష్ట్రులు అనంతపురముపై దండెత్తి వచ్చిరని మీరు

చదివియున్నారు. వారికి ధనము నిచ్చుటకుగాను బొక్కసములోని ధనము చాలక జనులకు పన్ను వేయవలసి వచ్చెనుగదా! కనుక బసవప్పగారు ఎట్లయిన ధనమును సంపాదించి సంస్థానమును నిలువజేయ వలయునని నిశ్చయించిరి.

తాడిపత్రి యందుండిన రంగు గోవిందరాయలను గూర్చి బసవప్పగారు వినిరి. ఇంకను అక్కడ ధనవంతులు చాలమంది ఉందురని నమ్మెను. ఆగ్రామమును ముట్టడించి ద్రవ్యమును దోచుకొని రావలయునని నిశ్చయించుకొనెను.

వెంటనే యొక సైన్యము తీసికొని తాడిపత్రి గ్రామమును ముట్టడించెను. కొంత సైన్యమును గ్రామములోనికి పంపి జనులనుండి ధనమును దోచుకొని రండని ఆజ్ఞాపించెను. పాపము ఆజనుల కష్టములను విచారించు వారెవరు? గోవిందరాయని నగరుచుట్టును బసప్పగారి సైనికులు కావలియుండిరి. ఆ జనులు ఎవరితో మొఱబెట్టుకొనవలెను? బ్రతికియుండిన చాలునని జనులు తమ ధనమును నగలను సైనికులకు ఇచ్చివేసిరి. బసవప్పగారి సైనికులు రంగు గోవిందురాయని నగరులోనికి బలవంతముగాపోయి అందున్న నగలను, ధాన్యమును గుడ్డలను పాత్రలను, పశువులను నగదు మొత్తమును తీసికొనిరి. అంతయేకాక గోవిందరాయని అతని బిడ్డలను ఖైదీలుగా పట్టుకొని బసవప్పగారి దగ్గరకు పోయిరి.



అచటయుండిన జనులకు పన్ను విధించి దానిని వసూలు చేసికొని బసవప్పగారు సైనికులతోను, ఖైదీలతోను అనంతపురమునకు ప్రయాణమైరి. కొందఱు జనులు ఈసమాచారమునంతయు మురారి రాయనికి దెలియజేసిరి. వెంటనే అతఁడు సాలే ఖానుని పిలిచి "ఓరీ! నీవు కొంతసైన్యము తీసికొని తాడిపత్రినుండి అనంతపురమునకు బోవుచున్న బసవప్పను అడ్డగించి, గోవిందరాయని విడిపించుకొని ఆధనమును తీసికొని రమ్ము" అని ఉత్తరవు చేసెను. అదేప్రకారము సాలే ఖానుఁడు ప్రయాణమై ఎక్కలూరు చేరెను. అయితే బసవప్పగారు అప్పటికే అనంతపురము చేరిరని విని మరల అతడు గుత్తిగ్రామమునకు మరలి పోయెను.

గోవిందరాయడు అనంతపురముననే ఖైదీగానుండెను. తాడిపత్రియందుండిన జనులకు గోవిందరాయనిపై చాలప్రేమ. వారు అతనికి కలిగిన కష్టమునకై చాల వ్యసనపడి 12 వేల వరహాలు వసూలుచేసి, బసవప్పగారికిచ్చి, గోవిందరాయని పిలుచుకొని పోయిరి.

—:o:—

# 12. శిద్ధరామప్పగారి మరణము.

:0:

రాజ్యము చక్కగా పాలించుచుండిన బసవప్పగారు క్రీ. శ. 1772-వ సంవత్సరమున చనిపోయెను. పాపము శిద్ధ రామప్పగారికి యేమి చేయను తోచలేదు. స్వంతముగా రాజ్యమును విచారించుటకు సామర్థ్యము లేదు. కనుక అతడు సుబ్బరాయుడు అను నతని సహాయముతో రాజ్యము చేయుచుండెను. పాపము బసవప్పగారు చనిపోయి నప్పటినుండియు శిద్ధ రామప్పగారికి కష్టమేగాని సుఖమును సంతోషమును లేక పోయెను.

మహారాష్ట్రులు అప్పుడప్పుడు అనంతపురముపై దాడి వెడలి దోచుకొని పోవుచుండిరి గదా? శత్రువులకు ధనము నిచ్చినందున బొక్కసమునందు ధనమేమియు ఉండలేదు. ఇట్లుండగా మహారాష్ట్రులకు రాజైన పీష్వాగారు కప్పము కట్టవలయునని చాల బాధింప సాగెను. కనుక శిద్ధరామప్ప వెండి బంగారు నగలను విక్రయించి పీష్వాగారికి రూకలు చెల్లించిరి.

బాలులారా! మన జిల్లాకు దక్షిణమున మైసూరు రాజ్యమున్నది. పటము తీసి చూడుడు. ఆ రాజ్యములో



మైసూరు అను పట్టణముకూడ ఉన్నది. అక్కడనే ఇప్పుడు మైసూరు మహారాజుగారు ఉండునది. ఆయన హిందూ తెగకు చేరినవారు. అయితే శిద్ధరామప్పగారు అనంతపురమున రాజ్యము చేయుచుండినపుడు, మైసూరు రాజ్యమును ఒక మహమ్మదీయుడు పాలించుచుండెను. ఆయన పేరు హైదరు. అయితే ఆయన మైసూరు పట్టణమున నుండలేదు. శ్రీరంగ పట్టణము అను గ్రామముననుండెను. హైదరు పరాక్రమశాలి. యుద్ధవీరుడు. ఒక సామాన్య సైనికుడుగానుండి రాజాయెను.

హైదరు క్రీ. శ. 1775-వ సంవత్సరమున ఒక గొప్ప సైన్యముతో గుత్తిదుర్గమును ముట్టడించెను. కొన్ని దినములకు గుత్తి, హైదరు పాలాయెను. హైదరు మురారి రావును ఖైదీగా పట్టుకొనెను. హైదరు గుత్తిని పాలించుటకు బాలాజీ రావును నియమించెను. "ప్రతి సంవత్సరమును అనంతపుర సంస్థానమును పాలించువారి నుండి 40,000 రూపాయలు వసూలు చేయుము." అని బాలాజీ రావుకు ఉత్తరవుచేసి, హైదరు శ్రీరంగపట్టణమునకుఁ బోయెను.

శిద్ధరామప్పగారి దురదృష్ట మెట్టిదోగాని బొక్కసము లోని ధనమంతయు శత్రువులకు లంచమిచ్చుటకే చాలకుండెను. సంస్థానము రానురాను చాల బీదస్థితికి వచ్చెను. జనులుకూడ సుఖమనునది యెట్టిదో తెలియక కష్టపడుచుండిరి. ఎప్పుడును శత్రువుల భయమే! ఎప్పుడు వచ్చునో! ఇక సుఖమెక్కడిది.

గుత్తి సుబాదారు బాలాజీ రాయడు చనిపోయెను. వెంటనే హైదరు నవాబు, క్రీ. శ. 1781-వ సంవత్సరమున నరసప్పయ్యను సుబాదారుగా నియమించెను. కొంతకాలమైన పిదప నరసప్పయ్య, శిద్దరామప్పను రూకలు చెల్లించవలయునని ఉత్తరవు చేసెను. నరసప్పయ్య స్వయముగా అనంతపురమునకు వచ్చెను. శిద్దరామప్పగారు నరసప్పయ్యతో "బొక్కసములో ధనమేమియు లేదు సంస్థానము పాడుపడినది. జనులందఱు చాల బీదలుగా నున్నారు. శత్రువుల బాధ ఎక్కువయైనది. నేను సంస్థానము పాలించలేను మీ సంస్థానమును మీరే తీసికొండు" అని చెప్పి కోటబీగము ఇచ్చివేసెను.

నరసప్పయ్య శిద్దరామప్పగారిని ఒక గృహమున ఉంచి అన్న వస్త్రాదులకు తగిన యేర్పాటుచేసి, ఆ యింటిచుట్టును కావలియుంచి, షేక్ మీరాను కిల్లాదారుగా నియమించి గుత్తికి మరలి పోయెను. అపుడు హాండే వంశస్తుల సంస్థానము మహమ్మదీయుల పాలాయెను.

శిద్దరామప్పగారికి ముగ్గురు కొమార్లు. పెద్ద రామప్ప, చిన్న రామప్ప అను నిద్దరిని నరసప్పయ్య తన దండులో చేర్చికొని యుండెను. మూడవ కుమారుఁడైన శిద్దప్పను శ్రీరంగపట్టణమునందుండిన హైదరు దగ్గరకు పంపెను.



కొంతకాలమునకు మహమ్మదీయులే గుత్తి అనంతపురములకు అధిపతులుగా నియమింపబడుచుండిరి. రాజు మహమ్మదీయుఁడు గనుక అతనికి మహమ్మదీయులపై ఇష్టము. వీరు శిద్దప్పకు అన్న వస్త్రాదులకు కూడ ధనము నిచ్చుట మానిరి. కనుక శిద్దరామప్పగారికి జీవనము జరుగుటే కష్టమాయెను. తన వద్దనున్న సొమ్ములను, పాత్రలను, అమ్ముకొనవలసి వచ్చెను. పాపము! ఎటువంటివారికి ఎంత కష్టము వచ్చెను. వైభవము ఎప్పటికిని స్థిరముగా నుండదు.

రానురాను శిద్దరామప్పగారు బలహీనులగుచుండిరి. ఇంతలో దండులో చేరిన యిద్దరు కొమారులును చనిపోయిరను పిడుగువంటి సమాచారము వినెను. తన యెదుట నుండిన శిద్దప్పను హైదరు దగ్గరకు పంపియుండెను, ఒక కుమారుఁడైనను దగ్గరలేడు. పాపము శిద్దరామప్పగారి వ్యసనమునకు మేరయేలేదు. కష్టములు ఎప్పుడును కలసివచ్చును. ఇంతలో శిద్దరామప్పగారి పట్టపుభార్య గతించెను. తగిలినకాలే తగులును కదా? కష్టపడుచుండు వారికే కష్టములు వచ్చును. ముసలితనమున శిద్దరామప్పకు ఎన్ని కష్టములో చూడుఁడు! ఈ వ్యసనమునకు తట్టుకొనలేక పోయెను. కనుక ఆయనకూడ క్రీ. శ. 1788 సంవత్సరమున దుఃఖము సహించలేక చనిపోయెను.

---

# 13. రుద్రప్ప.

శ్రీరంగపట్టణమున హైదరు రాజ్యము చేయుచుండెను. అతఁడు చనిపోయిన వెంటనే అతని కొమారుఁడైన టిప్పూ సుల్తాను రాజ్యము చేయుచుండెను. ఇతఁడుకూడ పరాక్రమశాలియే! అయితే ఇతడు చాల క్రూరుడు. ఇతని కాలమునఁ గొందఱు శత్రువులు శ్రీరంగపట్టణమును ముట్టడించవలయునని ఆలోచన చేయుచుండిరి.

ఈ సమాచారమువిని కొందఱు పాళెగాండ్రు స్వతంత్రులు కావలయునని యోచించుచుండిరి. అపుడు రాయదుర్గమున నుండిన బలిజ రుద్రప్ప కొంత సైన్యముతో కూడేరు గ్రామమునకువచ్చి "నేను శిద్దరామప్పగారి కొమారుఁడను. శ్రీరంగపట్టణము నవాబు మావారిని ఖైదీలుగా పట్టుకొని పోవునపుడు నేను తప్పించుకొని పోయితిని. ఈ అనంతపుర సంస్థానము నాకు చెందవలెను." అని చెప్పి కూడేరు గ్రామమును ఆక్రమించుకొనెను. జనులు అతని మాటలను నమ్మిరి. పిదప అతడు బుక్కపట్టణము, క్రొత్తచెఱువు, ముక్తాపురము మరూరు మొదలైన గ్రామములను పట్టుకొని, అనంతపురమును ముట్టడించెను.



ఈ సమాచారమును శ్రీరంగపట్టణమున టిప్పూ సుల్తాను వినెను. అతఁడు వెంటనే ఒక గొప్పసైన్యమును పంపెను. కొంతకాలమునకు ఆ సైన్యము అనంతపురమును చేరెను. రుద్రప్ప యీ క్రొత్త సైన్యమును చూచి భయపడ సాగెను. సుల్తాను సైన్యమునకును రుద్రప్ప సైన్యమునకును ఒక యుద్ధము జరిగెను.

రుద్రప్పగారి సైనికులు అనేకులు చనిపోయిరి. కొందఱు తప్పించుకొని పారిపోయిరి. అనేకులు ఖైదీలుగా పట్టుకొనబడిరి. అప్పుడు సుల్తాను సైన్యమునందుండిన నాయకులందఱును ఆలోచించి, చిక్కినవారిని ఏమి చేయవలయునని ఒకరి నొకరు అడుగుకొనిరి. పిదప వారి కాళ్ళు, చేతులను నఱకిన బాగుండునని తీర్మానించిరి. అదేప్రకారము చేసిరి! కటకటా! ఎట్టి క్రూరులు! వారికి కొంచెమైనను దయలేకపోయెను కదా? రాజు ఎట్లుండునో అతని వద్దనుండు సేవకులును అట్లనే ఉందురు? టిప్పూ సుల్తాను క్రూరుడని చెప్పితిమి కదా? కనుక అతని సైనికులును అట్లనేయుండిరి.అప్పటి నుండియు అనంతపురము టిప్పూసుల్తాను పరిపాలనకే లోబడియుండెను.

రుద్రప్ప, తాను శిద్దరామప్పగారి పుత్రుఁడని నమ్మించి మోసముచే రాజ్యము స్వాధీనపఱచుకొనఁజూచెను. అయితే అతని ప్రయత్నములు ఫలించినవా?

## 14. టిప్పూ సుల్తాను

———:0:———

శ్రీరంగపట్టణమున టిప్పూసుల్తాను ఉండెనని మీరు చదివితిరి. అతఁడు చాల క్రూరుఁడనియు తెలిసికొంటిరి. అతనికి హిందువులపై చాల వైరము. అతని రాజ్యమునకు చుట్టు నుండిన రాజ్యములను కొంచెము కొంచెముగా జయించవలయునని అతనికి ఆశయుండెను. కనుక అతఁడు పలుమారు చుట్టునుండు దేశములపై దాడి వెడలి గ్రామములను దోచి జనులను బాధ పెట్టుచుండెను.

ఇప్పుడు మన ప్రభువులగనున్న ఆంగ్లేయులును అప్పుడు చాల ప్రసిద్ధికెక్కియుండిరి. వారికికూడ ఎట్లయిన టిప్పూను జయింపవలయునని కోరికయుండెను. మహారాష్ట్రులును సహాయము చేసెదమనిరి. మన దత్తమండలములకు ఉత్తరమున హైదరాబాద్ రాజ్యము ఉన్నది. దానిని పాలించు రాజు మహమ్మదీయుఁడు. అతనికి నైజాము అని పేరు. నైజాము ఆంగ్లేయులకు పరమ స్నేహితుఁడు. అప్పుడు రాజ్యము చేయుచుండిన నైజాముకూడ ఇంగ్లీషువారికి సహాయము చేయుటకు ఒప్పుకొనెను.



కనుక మహారాష్ట్రులు, ఆంగ్లేయులు, నైజాము వీరు ముగ్వురును తమ సైన్యంబులతో శ్రీరంగపట్టణమును ముట్టడించిరి. టిప్పూ ధైర్యముతో పోరాడెను. రెండు నెలల వఱకు ఎవరును ఓడిపోలేదు. పిదప టిప్పూ యుద్ధము చేయుచుండగా చంపఁబడి నేలఁగూలెను. రాజ్యమును పోగొట్టుకొనుటయే గాక, ప్రాణమునుగూడ పోగొట్టుకొనెను. ఎంత చేసిన వానికి అంత ఫలమే! మైసూరు రాజ్యము 1799-వ సంవత్సరమున ఇంగ్లీషువారి వశమాయెను.

నైజాము తమకు సహాయము చేసినందులకుగాను, ఆంగ్లేయులు, అప్పుడు మైసూరు రాజ్యములో చేరియుండిన అనంతపురము, బళ్ళారి, కడప, కర్నూలు, అను నాలుగు జిల్లాలను నైజామునకు ఇచ్చివేసిరి.

ఇంతలో శ్రీరంగపట్టణమున నుండిన శిద్దరామప్పగారి కొమారుడు శిద్దప్ప ఎట్లో తప్పించుకొని కాళహస్తి తాలూకు పాపానాయని పేటలో దాగుకొని యుండెను. టిప్పూ చనిపోయిన సమాచారము విని కొంత సైన్యమును సమకూర్చుకొని అనంతపురమునకు వచ్చెను. అక్కడ సంస్థానమును టిప్పూపేర విచారించుచుండిన మహమ్మదీయులతో "మీ నవాబు టిప్పూ చనిపోయెను. నేను శిద్దరామప్ప నాయని కుమారుఁడను. నేను మీకు బాకీయుండు జీతములను ఇచ్చి

వేసెదను; మిమ్ముల నందఱిని నాకొలువున నుంచుకొనెదను. ఈ సంస్థానమును నావశము చేయుఁడు” అని చెప్పగా వారు దానికి సమ్మతించిరి. కనుక శిద్దప్ప అనంతపుర సంస్థానమును ఏలుచుండెను.

ఇట్లుండగా నైజాముగారు రాజారోషం రాయలకు ఒక గొప్ప సైన్యము నిచ్చి “మీరు అనంతపురమునకుపోయి సంస్థానమును స్వాధీనము చేసికొని శిద్దప్పకు అన్న వస్త్రాదులకు తగిన ఏర్పాటుచేసి, శిద్దప్ప తన సంసారముతో బుక్కపట్టణము దగ్గరనున్న శిద్దరామపురమున నుండవలయునని చెప్పుము.” అని ఉత్తరవు చేసెను.

అతఁడు అదేప్రకారము అనంతపురమునకు వచ్చి శిద్దప్పగారికి నైజాముగారి యుత్తరవును తెలియఁ జేసెను. శిద్దప్ప ఏమి చేయఁగలఁడు? అనంతపురము చిన్నసంస్థానము. నైజాము ఒక గొప్ప రాజ్యమునకు అధికారి. అదియునుగాక ఇంగ్లీషువారు టిప్పూను జయించి, టిప్పూసుల్తానునకు చేరి యుండిన అనంతపుర సంస్థానమును, తక్కిన మూడు జిల్లాలతోఁ గూడ నైజామునకు ఇచ్చిరి. కనుక విధిలేక శిద్దప్ప సంస్థానమును రాజారోషం రాయలకు అప్పగించి తన సంసారముతో శిద్ధరామపురమున కాపురముండెను. ఇతడే హండే వంశస్థులలో కడపటి వాఁడు.



గుత్తిదుర్గము.



కనుక మొదట విజయనగర రాజ్యములో చేరియుండి కొంతకాలము మైసూరు రాజులకు లోబడియుండిన మన అనంతపురము జిల్లా, ఈరీతిగా హైదరాబాదు నైజాముగారి పరిపాలనకు లోబడి యుండెను.

## 15. గుత్తి దుర్గము.

—:o:—

బాలులారా! మీరెవ్వరైన గుత్తిగ్రామమును చూచి యున్నారా? అచట ఒక బలమైన కోటయున్నది. అచట ఉండు కొండ మీదికి మీరెప్పుడైన పోయి యున్నారా! ఆ కొండ పైన నెంతో ఆనందముగానుండును. ఎన్నియో విషయములు మనసునకు వచ్చును. పూర్వము మురారి రాయడు ఉండిన ప్రదేశముననే మనము ఉన్నామని తలంచినపుడు మన కెంతో సంతోషముగా నుండును. అక్కడ ఏది చూచినను పూర్వకాలపు కథనే చెప్పును. ప్రతియొక వస్తువును మురారి రాయని గురించి ఏదో ఒక విషయమును తెల్పుచుండును.

మనము కొండ పైభాగమునకుఁ బోయిన అక్కడ గారతో కట్టబడిన ఒక అరుగు కనబడును. అదియే ఆ కొండ

యొక్క ఎత్తయిన భాగము. సాయంసమయమున మనము ఆ అరుగుపైఁ గూర్చున్న మన వ్యసనముల నన్నిటిని మఱచి ఎంతో ఉల్లాసముతో నుందుము. అక్కడ నుండి గ్రామమంతయు మనకు రమ్యముగా కనబడును. అక్కడనుండి క్రిందికి చూచిన మనతల తిరుగును. మనము క్రిందికి జారిపడిన ఇక మన ఆశయే యుండదు. అక్కడ కొండ చాల నేరుగా నున్నది. అక్కడ రాళ్ళు కత్తులవలె పదునైన అంచులుకలిగి యున్నవి. పూర్వము మురారి రాయడు ఆ అరుగుపైన గూర్చుండి పాచికల నాడుచుండెడు వాఁడట. ఒక్కవేళ అక్కడ కూర్చుండి తన సైనికులు ఖైదీలను అక్కడనుండి క్రిందికి పడద్రోయుచుండగా వేడుకకై చూచుచుండెడు వాఁడట. అది ఏటి వేడుకో! ప్రాణములు తీయించుటకూడ వేడుకనేమో!!

ఈ కొండపై అక్కడక్కడ పల్లములున్నవి. వాన కాలమున వాన్నినిండ నీరు నిలుచును. కనుక శత్రువులు కోటను ముట్టడించియుండినను లోపలనుండు వారికి నీటికి కష్టముండదు. ఇక్కడి కోట చాల బలమైనదని చెప్పితిమి కదా? ఈ దుర్గమును శత్రువులు స్వాధీనము చేసికొన వలసినచో, లోపల ఉండు జనులకు ఆహారములేకుండునట్లు చేయవలెను. అంతయే కాని ఆయుధములతో స్వాధీనము చేసికొనుటకు సాధ్యము కాదు. లేనేని, కోటలోనివారు ద్రోహముచేసి శత్రువులకు సహాయము చేయవలయును. అప్పుడే దుర్గము ఇతరుల పాలగును.



ఈ కొండపై మురారి రాయడు గుఱ్ఱములను, ఏనుగలను ఉంచుచుండిన కట్టడములు ఇప్పటికిని మనము చూడవచ్చును. మన జిల్లా ఆంగ్లేయుల స్వాధీనమైనపుడు వారు ఆ కట్టడములలో సీపాయిలను ఉంచుచుండిరి. 1860-వ సంవత్సరమున ఈ సైన్యమును ఆంగ్లేయులు తీసివేసిరి.

తుంగభద్రా నదీతీరమున విజయనగరమను గొప్ప పట్టణముండెననియు, అది ఒక గొప్ప రాజ్యమునకు ముఖ్య పట్టణమనియు చదివితిరి కదా? ఈ గుత్తి గ్రామము చాల కాలము ఆ విజయనగరపు రాజుల అధీనముననే ఉండెను.

క్రీ. శ. 1754-వ సంవత్సరమున మురారి రాయడు గుత్తి కోటను తన శాశ్వత నివాసస్థానముగా చేసికొనెను. అతడు కోటను భద్రపఱచెను. మురారి రాయని ప్రజలు అందఱును చాల గౌరవించుచుండిరి. అతని ధైర్య సాహసంబులకు అతనిని అందఱును మెచ్చుకొనుచుండిరి. మంచి పరాక్రమ వంతులను మాత్రము అతఁడు తనసైన్యములో చేర్చుకొనుచుండెను. సైనికులు ఇతని యెడల నెంతో భక్తి గలిగి యుండిరి. ఇతనికి వారిపై నెంతో ప్రేమ. అందఱును ఒక కుటుంబము వారివలె నెంతో సంతోషముతో నుండిరి. ఇందులకు కారణము లేకపోలేదు. కొల్లగొట్టిన ద్రవ్యమును మురారి రాయఁడు అందఱికిని సమానముగా పంచి యిచ్చుచుండెను. కలతలు ఎందుకు వచ్చును?

ఈ మురారి రాయనికి శ్రీరంగపట్టణము నుండిన హైదరు జన్మ శత్రువు. హైదరు ఒకతూరి గుత్తి దుర్గమును ముట్టడించెను. అయితే గుత్తి దుర్గమును అతడు పట్టుకొనలేక పోయెను. మరల రెండవతూరి గొప్ప సైన్యముతో గుత్తిదుర్గమును ముట్టడించెను. అప్పుడు కొండపైన నీరులేక పోయెను. దప్పివలన జనులు చాల బాధపడుచుండిరి. నీరులేక జనులు చనిపోవుదురు కదా అని దుఃఖించి మురారి రాయడు జనుల యొక్క క్షేమమును కోరి హైదరును శరణు వేడెను.

హైదరు మురారిరావును అతని సంసారమును శ్రీరంగపట్టణమునకు పంపెను. మరల మురారిరాయఁడు గుత్తిగ్రామమునకు రానేలేదు. గుత్తి హైదరు స్వాధీనమాయెను.

కొంతకాలమైన పిదప హైదరు మురారి రావును మైసూరు రాజ్యములోనుండు కబ్బాళ దుర్గమునకు పంపెను. పాపము మురారి రావు అచటనే చనిపోయెను.

హైదరు చనిపోయిన తరువాత అతని కుమారుడు టిప్పు రాజ్యమునకు వచ్చెను. ఇతడు చాల క్రూరుడని విని యుంటిరి. క్రీ. శ. 1791-వ సంవత్సరమున ఇతఁడు తన వద్ద నున్న ఖైదీలను అందరిని చంపించెను. అప్పుడు మురారిరాయుని కుటుంబములోని వారందఱును చంపఁబడిరి.







రాతితో చేయఁబడిన సర్పము
(లేపాక్షి).



# 16. లేపాక్షి

హిందూపురమునకు తొమ్మిది * మైళ్ళ దూరమున లేపాక్షి అనునొక గ్రామము కలదు. ఇచట ఒక ప్రసిద్ధమైన దేవాలయము కలదు. దానిని కట్టించినది విరుపణ్ణ. ఇతఁడు విజయనగర రాజ్యమునకు రాజుగానుండిన కృష్ణదేవరాయల యొక్క కోశాధిపతి. అప్పుడు కృష్ణదేవరాయలు పెనుగొండ యందు ఉండెను. విరుపణ్ణకు ఒకానొకప్పుడు ఒక విగ్రహము దొరకెను. దానికెట్లయిన ఒక దేవాలయము కట్టించవలయునని నిశ్చయించుకొనెను.

రాజుగారు గ్రామమునందు లేని కాలమున బొక్కసములోని ధనమును వ్యయముచేసి లేపాక్షి గ్రామమునందు ఒక గొప్ప దేవాలయమును కట్టించెను.

ఈ దేవాలయమునందు మహామంటపము అనునదే చాల అందమైనది. ఆ మంటపమును మనము చూచిన శిల్పి యొక్క చాతుర్యమును ఎంతో మెచ్చుకొందుము. చూపరులు ఎల్లరు ఆ మండపమును చూచి చాల ఆశ్చర్యపడుచుందురు. ఈ దేవాలయమును చూచుటకై ఎన్నియోగ్రామములనుండి జనులు గుంపులు గుంపులుగా వచ్చెదరు.

బాలులారా ! మీరును లేపాక్షిని చూడకుండిన త్వరలో పోయి చూడుడు. ఈ మహామండపమునకు 66 కంబములున్నవి. ఈ కంబములలో రెండు కంబములు అడుగు భాగమున ఒక మూల మాత్రమే నేల కానియున్నది. ఆహా! ఏమి ఆ శిల్పియొక్క నేర్పు ! కంబములపైన మనిషి యెత్తుగల పాటగాండ్ర బొమ్మలు ఎంతో ముద్దుగా చెక్కబడినవి. వాద్యములను వాయించుచుండినట్లు కొన్ని బొమ్మలు చెక్కబడి యున్నవి. బాలులారా ! చదువుచుండగనే మీకు ఆ దేవాలయమును చూడవలయునని ఆశకలుగుచున్న దేమో !

ఆ మండపమున నిలబడి పైన చూచితిమేని మిద్దెకు వేసియుండు బండలపై నెన్నియో విచిత్రములు కనబడును. రామాయణ కథను తెలుపునట్టి బొమ్మలు అక్కడ ఎన్నియో చెక్కబడినవి. ఇంకను మహాభారత కథను తెలియఁజేయు బొమ్మలనుకూడ అక్కడ చెక్కియున్నారు. ఈరామాయణమును గురించియు, మహాభారతమును గురించియు మీరు ముందు బాగుగ తెలిసికొనఁ గలరు.

ఈ మండపములో నింకొక చిత్రము కలదు. అచట ఒక బొమ్మయున్నది. నీవు ఎక్కడ నిలబడి దానితట్టు చూచినను అది నీతట్టే చూచుచుండును. నీవు ఏమూలయందు నిల



బడి చూచినను అది నిన్నే చూచినట్లుండును. మనము కాయితముపైకూడ అట్టి బొమ్మలను వ్రాయలేము. అట్టి రాతిపై ఆశిల్పి వాని నెట్లు చెక్కెనో ! వాని తెలివి ఎట్టిదో!!

ఈ మండపమునకు కొంత దూరమున ఒక రాతి బసవన్న ఉన్నది. అది 15 అడుగుల ఎత్తున్నది. సుమారు ముగ్గురు మనుష్యుల ఎత్తు. 27 అడుగుల పొడవున్నది. దాదాపు ఐదుగురు మనుష్యుల పొడవు. అది చాల అందముగనున్నది. అట్టిది చేయుట చాల కష్టముగదా ? బంకమట్టితోనైన మైనముతోనైన మీరు చేయగలరేమో చూడుడు. ఒకసారి చెడిపోయినను దానిని మరల ముద్దచేసి మరల చేయగలరు. రాతిని అట్లు చేయుటకు సాధ్యమా ? అది విరిగిన అతుకులు వేయవచ్చునా ? కనుక దానిని చేసినవాని సామర్థ్య మెట్టిదో చూడుడు. బంకమట్టితో చేసినను మనము తల చిన్నగను కడుపు పెద్దగను చేసెదము. వాడు అట్లు చేయలేదు. తలకు తగిన దేహము, దేహమునకు తగిన కాళ్ళుచేతులును, ఉంచినాడు. అందుచేతనే అది చూచుటకు చాల అందముగనున్నది. అదిగో ఆపుటయందున్న బొమ్మను చూడుడు. అచటనే ఏడు తలలుగల సర్పము ఒకే రాతిలో చెక్కబడియున్నది. చూచువారికి అది నిజముగా పామే అని తోచును.

బాలులారా! ఈ చిత్రములన్నిటిని చేయించినది విరుపణ్ణయే! పాపము ఆ విరుపణ్ణకు ఎట్టి కష్టము వచ్చెనో

చూడుడు. బొక్కసములోని ధనమును వాడుకొని నందులకు అతని కన్నులను పొడచి వేయవలయునని రాజుగారు ఆజ్ఞాపించిరి. రాజాజ్ఞకు బదులు చెప్పువారు ఎవ్వరు? అతని మాట జవదాట గూడదు. విరుపణ్ణ "ఇతరులు ఎందుకువచ్చి నా కన్నులను పొడువ వలయును. నేనే నాకన్నులను పొడిచికొనెదను" అని తన కన్నులను పొడచికొనెను. అయ్యో! ఎట్టి కష్టము. కల్యాణ మండపమునకు వెనుకనున్న బండపై ఇప్పటికిని రెండు నల్లని చుక్కలున్నవి. విరుపణ్ణ అక్కడనే తన రెండు కన్నులను పొడచుకొని రక్తమును కార్చెనని చెప్పుదురు. ఇప్పటికిని ఆ గుర్తులను చూచిన వారందఱు కన్నీరుఁ గార్చెదరు.

విరుపణ్ణ కొంతకాలమునకు లేపాక్షియందే చనిపోయెను. మండపము ఇప్పటికిని ముగింపుకాక అట్లనేయున్నది. విరుపణ్ణ యిట్టి దేవాలయమును కట్టించినందువలన గదా, పూర్వము మన శిల్పులు ఎంత నేర్పరులైనది మనము తెలుసుకొనుచున్నాము.





# 17. మడకశిర

—:o:—

మన జిల్లాయొక్క దక్షిణభాగమున మడకశిరా అను గ్రామము ఉన్నది. ఇది ఒక తాలూకాకు ముఖ్యపట్టణము ఈ తాలూకాయందు ఉద్యానవనంబులను, పైరుపచ్చలును, ఫలవృక్షములును మెండుగా నుండుటచేత చాల రమ్యముగా నుండును. అందువలననే ఈ ప్రాంతము మన జిల్లాయొక్క ఉద్యానవనమని పిలువబడుచుండెను. అయినను ఇటీవల ఇచ్చట వానలేక త్రాగుటకు కూడ నీరు లేకుండును.

మొదట ఈ గ్రామమునకు మడకపల్లి అని పేరు. ఈ గ్రామమునకు దగ్గరనుండు కొండపై నొక కోటఁ యున్నది. ప్రక్కపుట యందున్న బొమ్మను చూడుడు. ఈ పర్వతమున నుండు రాళ్ళు చాల ఎత్తుగాను ఏటవాలుగ లేక నేరుగాను ఉన్నవి. కొన్ని గుండ్లు ఒక్కొకటి ఏబది అడుగుల ఎత్తుగలవు! కొండపైన పోవుటకు రెండు త్రోవలు కలవు. దక్షిణమున నున్న త్రోవ చాల యిరుకై కొందఱు మాత్రము పోవుటకు వీలుగానున్నది. అట్టి చోటులలో బయట ఒక గొప్ప సైన్యమున్నను లోపలినుండి కొందఱు మాత్రము శత్రువులను ఎదిరింప వచ్చును. మనము ఆకొండ శిఖరమున నిలుబడి చూచిన పెనుగొండయందలి కొండను చూడగలము.

మైసూరు రాజ్యములో శిర అను గ్రామము కలదు. పూర్వము అచట పాళెగాండ్రు ఉండిరి. మడకశిర అను నీ గ్రామము, వారు కట్టించినదే! అప్పడనుండి ఇది వారికే లోబడి యుండెను.

ఇట్లుండగా బిజాపూరు నందలి మహమ్మదీయులు శిర సంస్థానమును జయించిరి. అప్పుడు శిరయందున్న పాళెగాండ్రు రత్నగిరి, మడకశిర అను రెండుగ్రామములను వానికి చేరిన పల్లెలను ఇచ్చి సుల్తానుతో సంధి చేసికొనిరి. కనుక ఈగ్రామము కొంతకాలము బిజాపూరు సుల్తానులకు లోబడియుండెను

ఇంతలో గుత్తి మురారి రాయడు ఈ గ్రామమును పాలించుచుండిన పాళెగాండ్రనుండి పలుమారు కప్పమును పుచ్చుకొను చుండెను. ఇంతకుముందు మురారిరాయడు మడకశిరా గ్రామమున నున్నట్లు మీరు చదివినారు కదా? మురారి రాయని తండ్రియగు హిందూరావు ఈ గ్రామమున నే చనిపోయెనని చెప్పదురు. ఈ హిందూరావు పేరటనే హిందూపురమను పేరు వచ్చినది. ఇప్పటికిని క్రొత్త తాలుకు కచేరి చెంత హిందూరావు బావి అని ఒక బావి కలదు.

మైసూరునందు హైదరు రాజ్యము చేయుచుండెను. అతఁడు మురారి రాయనికి శత్రువు కదా? కనుక మడకశిరా యందున్న పాళెగాడు మురారి రాయనికి కప్పము ఇచ్చుట



రత్నగిరి కోట.



చూచి హైదరు ఓర్వడాయెను. వెంటనె అతడు దండుతో వచ్చెను. మడకశిరా అతని స్వాధీనమాయెను. అప్పటి నుండి యు నీ గ్రామము టిప్పూ చనిపోవువఱకు మైసూరు రాజ్య మునకే చేరియుండెను. ఈగ్రామము చాలకాలము మైసూరు రాజ్యమునకు చేరియుండుటయేగాక, ఈ తాలూకా చుట్టును మైసూరు రాజ్యమేయున్నది. అందుచేతనే ఇచట జనులు ఇప్పటికిని మైసూరు రాజ్యమున వాడు 'కనడము' అను భాష నే వాడెదరు. టిప్పూ చనిపోయిన పిదప మన జిల్లా అంతయు ఆంగ్లేయులకు చేరెను. అప్పటినుండి మడకశిరా ఆంగ్లేయులకే చేరియున్నది.

---

## 18. రత్నగిరికోట.

---:o:---

మైసూరు రాజ్యమున శిర అనుగ్రామము ఉండెనని చదివితిరి. అచ్చట పాళెగాండ్రు ఉండిరి. వీరు కొంతకాలము రత్నగిరియందు కాపురముండిరి. ఇచ్చట ఉండు కొండపై నొక బలమైన కోట యున్నది. అది శత్రువులకు అభేద్యము. నిట్టువగానుండు గుండ్లు ఎన్నియో యీకొండపైగలవు. అచ్చటచ్చట దొణలు అనేకములున్నవి. కొన్ని దొణలు

సుమారు 50 అడుగులు లోతు ఉన్నవి. వానకాలమున నివి నీటితో నిండియుండును. శత్రువులు కోటను ముట్టడించినపుడు ఈ ద్రోణలు ఎంతో ఉపయోగముగా నుండును.

మహారాష్ట్రులు ఇచ్చట పాళెగాండ్రనుండి పైకమును వసూలు చేయుటకు లక్ష్మణనాయడు అనువానిని నియమించి యుండిరి. లక్ష్మణనాయడు పరాక్రమశాలి. రత్నగిరి దుర్గమును ఆప్రాంతము నంతయు జయించి తన అధికారమున ఉంచుకొనియుండెను.

హైదరు దండెత్తివచ్చి మడకశిరాను పట్టుకొనెనుగదా? అప్పుడే అతడు రత్నగిరిని కూడ స్వాధీనము చేసికొనెను. 1792-వ సంవత్సరమున సుల్తానుయొక్క ముఖ్యపట్టణమైన శ్రీరంగపట్టణము శత్రువులచే ముట్టడింపబడెను. ఆ సమయము చూచి రత్నగిరియందున్న పాళెగాడు టిప్పూ సుల్తానునకు ఎదురు తిరిగెను: అతడు స్వతంత్రుడు కావలయునని ప్రయత్నించెను. టిప్పూ ఈ సమాచారమును వినెను. అతడు చాల సాహస వంతుడు కదా! అతడు ఇట్టి సమాచారమువిని యూరకుండ గలడా? అతనికి చాల కోపము వచ్చినది. వెంటనే అతడు సైన్యముతో రత్నగిరికి వచ్చి ఆగ్రామమును ముట్టడించెను. అయినను రత్నగిరికోట సుల్తానునకు స్వాధీనము కాకపోయెను. అతడు ఆకోటను ఆరునెలలు ముట్టడించి పిదప స్వాధీన పఱచుకొనెను.



పెనుకొండయందుండు "గగనమహాల్"

పెంకులచేఁగప్పబడిన భాగము ఇటీవల కట్టఁబడినది.



తన పగ దీర్చుకొనుటకై ఆగ్రామమున నుండిన వారి నందఱిని బలవంతముగా మహమ్మదీయ మతములో చేరునట్లు చేసెను. అంతటితోనే అతఁడుతృప్తినొందలేదు. ఆగ్రామము నందలి పైరు పంటలను పాడుచేసి ఆ గ్రామమును అడవిగా జేసెను. అప్పటినుండియు టిప్పూసుల్తాను చనిపోవు వఱకును ఈ గ్రామము మైసూరునకే చేరి యుండెను.

ఈ గ్రామమున నొక జైనుల దేవాలయము కలదు. టిప్పూ చనిపోయిన పిదప తక్కిన గ్రామములవలెనే ఇదియు ఆంగ్లేయులకు చేరెను. పూర్వమున ఇది చాల ప్రసిద్ధిగాంచి యుండినను ఇప్పుడు రత్నగిరి యొక కుగ్రామముగా నున్నది. ఈ పల్లె కొన్ని పూరి కొట్టములు, ధుమ్మధూళిచే నిండిన వీధులు కలిగి పనికి మాలిన చోటుగా నున్నది. కాని కొండ పైనుండు కోటమాత్రము పూర్వపు వైభవమును చాటుచునే యున్నది.



## 19. గగన మహాల్



బాలులారా! ప్రక్కపుట యందున్న పటమును చూచితిరా? అదియే పెనుకొండయందుగల గగన మహాలు.

గగన మహాలు అనగా ఆకాశమును అంటునటువంటి మందిరము అని అర్థము. ఈకట్టడము ఎంత అందముగా నున్నదో చూచితిరా ? ఇది రెండు అంతస్తులు కలది. ఈ కట్టడము అంతయు వెదకినను ఒకకట్టెదూలమైనను దంతెయైనను లేదు. అంతయు గారతోడను రాతితోడను కట్టబడినది. దీని పైభాగమునకు పోవుటకు సోపానము కలవు. ఈరెండు అంతస్థులకన్న మిక్కిలి ఎత్తుగా నొక గోపురము కనబడుచున్నది. చూడుడు. దానిపైనకు పోవుటకు వేరు మార్గముకలదు. అచట ఉండు మెటికల నెక్కుచు గుండ్రముగా పైకిపోయిన గోపురముయొక్క పైభాగమునకు బోగలము. అక్కడ నిలబడి చూచిన పెనుకొండ గ్రామమంతయు చక్కగా కనబడును. ఇది 64 అడుగుల ఎత్తు కలదు. వర్షకాలమున ఈగోపురము నెక్కి చుట్టునుండు ప్రదేశమును చూచిన నెంతో రమ్యముగా నుండును. పచ్చని పచ్చికచే గప్పబడిన నేలయు, పొదలచేతను వృక్షములచేతను కప్పబడిన కొండయు, కొంతకొంత దూరముననుండు బురుజులును, అచ్చటచ్చటనుండు ద్రాక్షతోటలును చూచుటకు మనోహరముగా నుండును.

ఇట్టి అందమైన కట్టడమును ఎవరు కట్టించిరి? ఇక్కడ ఎవ్వరు కాపురము చేయుచుండిరి? అని మీరు అడుగగోరెదరా?

పూర్వము విజయనగరమను రాజ్యము ఉండెనని మీకు తెలియును కదా? ఆ రాజ్యమును మొదట బుక్క-



శ్రీకృష్ణదేవరాయలు.



రాయలు ఏలుచుండెను. అతని కాలముననే పెనుకొండయందు ఒక బలమైన కోటను కట్టిరి. ఈ కొండ పైభాగమున ఒక కిల్లాను కట్టిరి. శత్రువులు కోటను ముట్టడించినపుడు రాజులు ఈ కిల్లాయందు దాగుకొనుచుండిరి. ఈ కిల్లాను కాపాడుటకు కొండపై అక్కడక్కడ బురుజులున్నవి. రామ బురుజు అనునది ఇప్పటికిని చూచుటకు అందముగా నున్నది. విజయనగరపు రాజులు అప్పుడప్పుడు ఈ గ్రామమున నివసించుచుండిరి. పెనుకొండయందలి కోట విజయనగరపు రాజులకు ఎంతో ప్రయోజనముగా నుండెను.

ఈ విజయనగరమును పాలించిన రాజులలో చాల ప్రసిద్ధిగాంచిన వాడు శ్రీకృష్ణదేవరాయలు. కృష్ణదేవరాయలు వసంతకాలమున ఈ పెనుగొండయందే నివసించుచుండె. వసంతకాలమున ఈ పెనుగొండ చాల మనోహరముగా నుండును. అతఁడే యీ గగన మహలును కట్టించినది. అతని ముఖ్యపట్టణము విజయనగరము కదా? అది యిప్పుడు పాడైనది. దాని కిప్పుడు హంపియని పేరు. అచటకూడ అతడు ఎన్నియో మంచి కట్టడములను కట్టించెను. కొన్ని యిప్పటికిని అట్లనే యున్నవి. అవి అన్నియు గగన మహలు వంటి కట్టడములే!

ఇంతయేకాక అతఁడు పెనుకొండయందు ఎన్నియో గొప్ప దేవాలయములను కట్టించెను. ఎన్నియో కోనేరులను,

కొలనులను త్రవ్వించెను. ఇప్పటికిని పెనుకొండ యందు 'పాలొక్కరి' 'పసురొక్కరి' అను పేరులుగల గొప్ప కోనేరు లున్నవి. కృష్ణదేవరాయలు విద్యాభిమాని. ఇతఁడు పెక్కు కవులను పోషించుచుండెను. ఇతనికాలమున తెలుగుభాష చాల అభివృద్ధిఁగాంచెను. ఇతఁడుకూడ కొన్ని చక్కని గ్రంథములను వ్రాసెను. పెనుకొండయందుగూడ ఇతని కాలమునఁ గొందఱు గొప్ప కవులు ఉండిరని నమ్ముటకు వీలున్నది. పెనుకొండయందు పూర్వము కవులు ఉండిరని మనమెట్లు ఇపుడు గ్రహింపవచ్చును? పూర్వము గ్రంథములను వేనిపైన వ్రాయుచుండిరి. ఒక కవి చనిపోయినను అతఁడే ప్రపంచమున నేమి విడచి పోవును?

హైదరు మొదలైన మహమ్మదీయులు మన జిల్లాపై దండెత్తి వచ్చిరికదా! ఆ సైనికులలో కొందఱు కృష్ణదేవరాయలు కట్టించిన దేవాలయములలో కొన్నిటిని పాడుచేసిరి. పెనుకొండయందు ఇప్పటికిని కోటలో నొక దేవాలయము కలదు. బయటనుండి చూచిన ఇది దేవాలయమువలె నగపడును. లోనికిపోయిన ఒక మశీదే! మొదట హిందువుల దేవాలయముగా నుండిన దానిని మహమ్మదీయులు మశీదుగా మార్చిరి. కనుక ఇది మహమ్మదీయులలో కొందఱి పనియే!

గగన మహలునకును ఈమశీదునకును నడుమ రెండు దేవాలయములు కలవు. ఒకటి రాముల దేవాలయము, రెండ



వది ఈశ్వరుని ఆలయము. ఆ దేవాలయములయందు ఎక్కడ జూచినను పురాణములలోని కథలను, రామాయణములోని కథలును తెలియజేయు బొమ్మలు ఎన్నియో కలవు.

రామస్వామి ఆలయమున నున్న బొమ్మలు చాల స్పష్టముగను, చక్కగను అగపడుచు చూచుటకు చాల అందముగా నున్నవి. వానిని చెక్కిన శిల్పి ఎక్కువ నేర్పరి అనికూడ మనకు తెలియగలదు. ఈ దేవాలయపు గోడలపై, రామలక్ష్మణులు విశ్వామిత్రునివెంట పోవుచు, త్రోవలో తాటకిని చంపుటయు, విశ్వామిత్రుని యజ్ఞమును అపవిత్రము చేయుచున్న రాక్షసులను రామలక్ష్మణులు చంపుట, రాక్షసులు, దేవతలు అమృతమునకై పాలసముద్రమును త్రిచ్చుట, దుడుకుతనము చేయుచుండిన చిన్నికృష్ణుని తల్లి ఒకఱోలునకు కట్టిన, కృష్ణుడా ఱోలును లాగుకొని వచ్చునపుడు ఆ ఱోలు రెండు వృక్షములకు అడ్డము పడినను యీడ్చుచుండుటను, తల్లి మజ్జిగ చిలుకు నపుడు కృష్ణుడు కవ్వము పట్టుకొని వెన్నకై జొరబడుట, పొట్టి బ్రహ్మచారియై బలిచక్రవర్తిని మూడు అడుగుల నేలను దానమడిగి, భూమిపై నొక్క యడుగును, ఆకాశమున నొక యడుగును, పెట్టి మూడవ అడుగునకు చోటులేక బలిచక్రవర్తి తలపైననే వామనమూర్తి పాదమును మోపుటయు, శ్రీకృష్ణుడు మురళిగానము చేయుచు గొల్లభామలను

భ్రమింపఁజేయుటయు, లక్ష్మణుఁడు శూర్పణఖయొక్క ముక్కును, చెవులను కోయుటయు, మొదలైన కథలను విశదముగా తెలియఁజేయు చిత్రము లెన్నియో అచ్చటనున్నవి.

ఈశ్వరుని దేవాలయమున బొమ్మలు ఇంతవిశదముగా లేవు. ఇది ఆ దేవాలయమున కన్న పూర్వము కట్టబడి యుండ నోపు. ఇచటకూడ చిత్రమైన బొమ్మలు ఎన్నియో కలవు. రావణుని తలలు రాముఁడు వేసినబాణములచే తెగిపోవుటయు రథములలోగూర్చొని వింటిని బాణములను, తీసికొని రాజులు యుద్ధమునకు పోవుటయు, ఆ రథములను గుఱ్ఱములు లాగుటయు మనము చూడవచ్చును. మనము ఈ బొమ్మల నుండి యేమి గ్రహింపవచ్చును? ఈ బొమ్మలనుండి మనము యెన్నియో విషయములను దెలిసికొనవచ్చును. అప్పుడు జనులు వాడుచుండిన ఆయుధములు ఎట్టివి, వారెట్టి యుడుపులను ధరించుచుండిరి, వారి రథములు ఎట్లుండెను, అను విషయములను మనము తెలిసికొన వచ్చును.

పెనుకొండ కోటకుబయట షర్ ఖాను మశీదు కలదు. అదికూడ పూర్వము హిందువుల దేవాలయముగ నుండినదే! కాని ఇప్పుడా విషయమును తెలియజేయు గుర్తు లెవ్వియు లేవు. ఆమశీదునందు రెండు బోలు కంబములు కలవు. వానిలో చిన్న కంబములు కలవు. మనము లోపలికి చేతులనుపెట్టి ఆ



చిన్న కంబములను త్రిప్పిన అవి గిరగిర తిరుగును! ఆహా! ఏమి ఆశ్చర్యము! వానిని చేసిన శిల్పి యొక్క నేర్పునకు ఏమనవచ్చును. బాలులారా! మీరు ఎప్పుడైనను పెనుకొండకు పోయిన వానిని తప్పక చూచిరండు.

మహమ్మదీయులకును విజయనగరపు హిందూ రాజులకును జరగిన తాలికోట యుద్ధమున హిందువులు ఓడిపోయిరి. విజయనగరము పాడుపడెను. అప్పుడు రాజుగా నుండిన రామరాజును తురకలు చంపిరి. అతని తమ్ముడు తిరుమలరాయడు, రాజ్యమునకు వారసుడైన సదాశివరాయలను బాలుని పిలుచుకొని పెనుకొండకు పారిపోయెను. అప్పటి నుండియు పెనుకొండయే విజయనగర రాజ్యమునకు ముఖ్య పట్టణముగా నుండెను.



## 20. కుందుర్పి.

—:0:—

కుందుర్పి అను గ్రామము కల్యాణదుర్గము తాలూకాలోనిది. ఇది ఆ తాలూకాలో నైరుతి మూలనున్నది. యీ గ్రామము చెంతనున్నకొండ సుమారు 3001 అడుగులు

ఎత్తున్నది. ఈకొండయొక్క యొకవైపు ఏటవాలుగాలేక గోడవలె చక్కగా నున్నది. పూర్వము యీకొండపైన ఒక పాళెగాడు ఒక కోటను కట్టియుండెను. ఆ కోట యిపుడు పాడుపడినది. దాని గుర్తులు ఇప్పటికిని మనము చూడ వచ్చును. యీ గ్రామమున నుండిన పాళెగాండ్రలో కోనేటినాయుఁడు మొదటివాఁడు. యీ కోనేటినాయుఁడు బిజాపురముననున్న సుల్తానునకు పెనుగొండ గ్రామమును స్వాధీనము చేసెను. అందుచేత బిజాపూరు సుల్తాను చాల సంతోషించి కుందుర్పి గ్రామమును అతనికి బహుమానముగా 1652 సంవత్సరమున నిచ్చివేసెను. అప్పటి నుండియు నీగ్రామము కోనేటినాయనికే చేరియుండెను. కోనేటినాయఁడు పెనుకొండనుండి కుందుర్పికి పోవునపుడు పెనుకొండయందున్న విగ్రహములను పెక్కింటిని తనతోఁగూడ తీసికొని పోయెను. ఆ చుట్టు గ్రామములలో నుండు జనులు దేవాలయములను కట్టించినపుడు కుందుర్పి నుండియే విగ్రహములను తీసికొనిపోయి ప్రతిష్ఠ చేయుచుండిరి.

కల్యాణదుర్గమునకు సుమారు 20 మైళ్ళ దూరములో రాయదుర్గమను గ్రామమున్నది. అది బళ్ళారి జిల్లాలోని గ్రామము అచట పూర్వము ఒక పాళెగాడుండెను. పాళెగాడనగా నొక చిన్నరాజు. అతనికిని అదేగ్రామమున నున్న మఱికొందఱికిని కలహము కలిగెను. అపుడు ఎదురు కక్షి



చింతలరాయని దేవాలయము

తాడిపర్తి.



వారు కోనేటినాయని సాయమును కోరిరి. ఇతని సహాయముచే రాయదుర్గముననున్న పాళెగానిని పారఁదోలవలయునని వారు తలఁచియుండిరి. ఆ ప్రకారము కోనేటినాయునికి జాబువ్రాసిరి. అతఁడు ఇదే సమయమని సంతోషముతో సమ్మతించెను. పిదప కోనేటినాయఁడు తన సైన్యముతో కుందుర్పినుండి రాయదుర్గమునకు ప్రయాణమయ్యెను. కోనేటి నాయఁడు రాయదుర్గమునుచేరి ఆపాళెగానిని సులభముగా పారదోలెను. అప్పటినుండియు రాయదుర్గము కోనేటినాయని పాలాయెను.

బాలులారా! చూచితిరా? ఇద్దరు కలహించినందున మూడవ వానికి లాభమైనది. కనుక మీరెప్పుడును ఒకరితో నొకరు కలహింపకుఁడు అందువలన మీకు నష్టమేకాని లాభము లేదు.

---

## 21. చింతలరాయని దేవాలయము.

———:o:———

పెన్నానది మన జిల్లాగుండా పారుచున్నది. ఆ నది గట్టున తాడిపర్తి గ్రామమున్నది. ఈ గ్రామము విజయనగరపు రాజైన కృష్ణదేవరాయలకు చేరియుండెను. అతని కాల

మున ఇచ్చట రామలింగనాయుడు అను పాళెగాడు ఏలు చుండెను. ఇప్పుడు ఏటి గట్టుననున్న రామలింగస్వామి దేవాలయము లేక రామేశ్వర దేవాలయము అని పిలువబడు ఆలయము అతడు కట్టించినదే! ఈ దేవాలయము ఇప్పుడు పాడు పడియున్నది. ఇచ్చటనుండు చిత్రములు శిథిల రూపమున నున్నవి.

రామలింగనాయని కొమారుడైన తిరుమలనాయుడు చింతల తిరువెంకటస్వామి దేవాలయమును కట్టించెను. దానినే ఇపుడు చింతలరాయని దేవాలయమని పిలిచెదరు. యీ దేవాలయమున కూడ రామాయణమును, పురాణముల యందలి కథలను తెలియజేయు బొమ్మలు ఎన్నియో చెక్కబడి ఉన్నవి.

తాళికోట యుద్ధమున విజయనగరము పాడయ్యెను కదా! అపుడు విజయనగరము మహమ్మదీయుల పాలయ్యెను. అప్పుడు తాడిపత్రికి కూడ మహమ్మదీయులు వచ్చి కొల్ల గొట్టిరి. మహమ్మదీయులలో కొందఱు దుర్మార్గులు తిరుమల నాయుడు కట్టించిన అందమైన చింతలరాయని దేవాలయము చూచి ఓర్వలేక దానిని పాడుచేసిరేమో? అచట రాళ్ళపై చెక్కబడిన బొమ్మలనెల్ల విరుగగొట్టి వికారముగా చేసిరి. పాపము తిరుమలనాయుడు, ఎంతకష్టపడి, ఎంతధనము



వ్యయముచేసి కట్టించెనో కాని, దానిని మహమ్మదీయులు మాత్రము కొంతకాలములోనే పాడుచేసిరి. కట్టించినవారి కష్టము వారికేమి తెలియును? అప్పుడు తిరుమలనాయుడు బ్రతికియుండిన ఎంత దుఃఖించి యుండునో?

పిదప తాడిపత్రి మురారిరాయని వశమాయెను. అప్పుడతడు తాడిపత్రిని పాలించుటకు అమల్దారులను నియమించెను. వారు ఆ దేవాలయమునందలి మండపమును కొంతవఱకు మరమ్మతు చేయించిరి. మురారి రాయలను హైదరు ఖైదీగా శ్రీరంగపట్టణమునకు పిలుచుకొని పోయెనుకదా? అపుడు మరల ఈ గ్రామము మహమ్మదీయుల పాలాయెను.

అప్పటినుండియు ఈ గ్రామముపై పలువురు దండెత్తి వచ్చుచుండిరి. ఇక ఆ గ్రామముననుండు జనుల కష్టములను చెప్పవలయునా? టిప్పూచనిపోయిన తరువాత ఈగ్రామము కొంతకాలము హైదరాబాదు నైజామునకు చేరియుండెను. పిదప నైజాము ఈ గ్రామమును ఆంగ్లేయులకు ఇచ్చివేసెను. దీనిని గురించి ముందుకథలో మీరు చదివెదరు.



# 22. ధర్మవరము.

---

బాలులారా! మన జిల్లాగుండ పెన్నానది ప్రవహించుచున్నది గదా? అదిగాక మఱియొక నదిగూడ మన జిల్లాయందు ప్రవహించుచున్నది. దానిని గూర్చి మీరు భూగోళశాస్త్రమునఁ జదివియుందురు. దాని పేరు చిత్రావతి. మన జిల్లాలోనుండు ధర్మవరమున యీ నదికడ్డముగా నొక పెద్ద చెఱువు కట్టబడినది. ఈచెఱువునిండినపుడు చూచుటకు చాల అందముగా నుండును. ఈ చెఱువుక్రింద ఎన్నియో ఎకరముల భూమిని దున్ని పంటఁబెట్టుచున్నారు.

క్రియాశక్తి యొడయర్ అను నతఁడే ఈ చెఱువును త్రవ్వించి జనులకు చాల మేలు చేసెను. ఇతఁడు విజయనగరమును ఏలుచుండిన బుక్కదేవరాయల మంత్రి. చెఱువు గట్టునందు ఈశ్వరుని దేవాలయముగూడ నీతఁడు గట్టించినదే! ఈ దేవాలయములో నొక ఊట యున్నది. అది ఎప్పటికిని యెండిపోదట! దానియందెల్లప్పుడును నీరుండునట! యీతీర్థమును గ్రహించుటకై ప్రతిసంవత్సరమును సంక్రాంతి పండుగనాడు అనేకులా గ్రామమునకుఁ బోయెదరు.



క్రియాశక్తి యొడయర్ తల్లి ధర్మాంబ. ఆమె పేరిట యీ గ్రామమున కతఁడు ధర్మవరమని పేరు పెట్టెను.

ఈ యూరి చెఱువు కట్టవద్ద నొక ప్రాతకట్టడమున్న అది మూఁడు అంతస్తుల కట్టడము. అది యొక పాళెగాని మేడవలెనున్నది. ఈధర్మవరముకూడ అనంతపురముననున్న హండేవంశస్థులకే చేరియుండెను కాని యిచట ఎవ్వరును స్వతంత్రముగ పరిపాలించుచుండినట్లు లేదు. రాయదుర్గము కోనేటినాయని స్వాధీనమయ్యెఁ గదా? ఆ కోనేటినాయఁడు ధర్మవరమునుకూడ స్వాధీనముచేసికొని కొంతకాలము తన సైన్యము నిచట ఉంచియుంచెను. ధర్మవరముననుండు ప్రాతకట్టడము రాయదుర్గముననున్న కొన్ని ప్రాతకట్టడములను బోలియున్నది. దీనిని కోనేటి నాయఁడే కట్టించెనేమో?



# 23. మనజిల్లా ఆంగ్లేయులకు ఎట్లు వచ్చెను.

—:o:—

మైసూరు రాజ్యమును పాలించుచుండిన టిప్పుసుల్తానును ఓడించుటలో ఆంగ్లేయులకు హైదరాబాదు నైజాము

సహాయము చేసెను. అందులకై ఆంగ్లేయులు అతనికి కడప, బళ్ళారి, కర్నూలు, అనంతపురము యీ నాలుగు జిల్లాలను 1799-వ సంవత్సరమున నిచ్చిరి.

ఆ కాలమునందు ఎక్కడ చూచినను కలతలే? గొప్ప సైన్యములు కలరాజులు పలుమారు చిన్న రాజ్యములవారిని బాధించుచుండిరి. వారికి ఈ బలహీనులైన రాజులు ధనము ఇచ్చుకొలదిని వారు పలుమారు రాదోడగిరి. మహారాష్ట్రులు ఇట్లు చేయుచుండుట మీరు ఇదివరకే ఎఱుగుదురు. ఇప్పుడు బొంబాయి రాజధాని అనునదే పూర్వము మహారాష్ట్రుల రాజ్యముగా నుండెను. వీరు హైదరాబాదు నైజామునుకూడ పలుమారు బాధించి రాజ్యమును కొల్లగొట్టు చుండిరి. వీరి బాధ నెట్లయిన తప్పించుకొన వలయునని నైజాము ప్రయత్నించుచుండెను.

ఆంగ్లేయులు మంచి యుద్ధవీరులు. మన హిందూ దేశపు రాజులు ఒకరితో నొకరు పోట్లాడుచుండిరి. వీరిలో కొందఱు ఆంగ్లేయుల సహాయమును కోరి తమ శత్రువులను పారదోలు చుండిరి. ఇట్లు సహాయము చేసినందులకై ఆంగ్లేయులకు హిందూ దేశపు రాజులు కొంత ధనమునో లేక కొంత రాజ్యమునో ఇచ్చుచుండిరి.



కనుక మొదట వ్యాపారమునకై ఆంగ్లేయులు మన దేశమునకు వచ్చినను, రానురాను రాజ్యమునుకూడ సంపాదింప మొదలిడిరి.

అపుడు ఆంగ్లేయులు ఈ హిందూదేశపు రాజులను తమ అధికారములో ఉంచుకొనుటకు ఒక ఉపాయము చేసిరి. స్వదేశరాజులందఱికిని ఈ రీతిన వ్రాసి పంపిరి. "అయ్యా! మేము చక్కగా యుద్ధము చేయగలము. మా సైన్యమును మీ ముఖ్యపట్టణమునందు ఉంచెదము. మీ దేశముపై శత్రువులు వచ్చిరేని మా సైన్యము యుద్ధముచేసి వారిని పారదోలును. మీకు శత్రువుల భయము ఉండదు. అయితే ఈ సైన్యమునకు అగుకర్చు మీరు భరించవలయును. ఒకవేళ మాకు కష్టమువచ్చిన మీరు సహాయము చేయవలయును. మనము ఎప్పుడును స్నేహితులమై యుండవలయును. మీరు మమ్ము అడుగకుండ ఇతరులతో ఏమి సంబంధము కలుగ జేసికొన కూడదు. ఇందులకు మీరు సమ్మతించెదరా?"

ఇట్లు ప్రతిస్వదేశపు రాజునకును వ్రాసిపంపిరి. నైజాము ఇట్టి సహాయమునకై కాచుకొని ఉండెను. మహారాష్ట్రుల బాధ తప్పును కదా, అని ఆయన సంతోషపడెను. కనుక ఆయన దీనికి సమ్మతించెను.

ఈ ఏర్పాటునకు సమ్మతింపక ఆంగ్లేయులను తిరస్కరించిన టిప్పూను ఓడించి వారి రాజ్యమును తీసికొనిరి.

ఆంగ్లేయులు వెంటనే ఒక సైన్యమును హైదరాబాదు దేశముననుండు సికిందరాబాదు పట్టణమున నుంచిరి. యీ పట్టణము నైజాము నివసించు ముఖ్యపట్టణమునకు సమీపముననే ఉన్నది. అప్పటి నుండియు ఆంగ్లేయులకును నైజాము సంతతి వారికిని చాల స్నేహము. కనుకనే నైజాము సంతతి వారు ఇప్పటికిని రాజ్యమునేలుచు హాయిగనున్నారు. ఇప్పటికిని సికందరాబాదున ఆంగ్లేయుల సైన్యమున్నది. గర్వముచేత ఆంగ్లేయులను తిరస్కరించినందున టిప్పూ తన రాజ్యమును, ప్రాణమును పోగొట్టుకొనెను.

ఈసైన్యముయొక్క ఖర్చులు నైజాము ఇవ్వవలయును కదా? యీసహాయముచేయు ఏర్పాటునకు సమ్మతించిన కొంత కాలమునకు సైన్యపుఖర్చు ఇచ్చుటకు నైజామునకు ద్రవ్యము లేక పోయెను. అప్పుడు నైజాము మైసూరు యుద్ధమున తనకు ఆంగ్లేయులు ఇచ్చియుండిన అనంతపురము, కడప, కర్నూలు, బళ్ళారి జిల్లాలను మరల ఆంగ్లేయులకే దత్తముచేసెను. కనుకనే యీ నాలుగు జిల్లాలును దత్తమండలములని పిలువబడుచున్నవి. అప్పటినుండియు మన జిల్లా ఆంగ్లేయులచే పరిపాలింప బడుచున్నది.



సర్ థామస్ మన్రో.



# 24. మన్రో ప్రభువు.

———:0:———

బాలులారా! మీ రెప్పుడైన అనంతపురమునకుఁ బోయి యున్నారా? బజారు వీధిని మొదటి యంగడి గోడకు ఒక పలక వేయబడియున్నది. దానిపై నేమి వ్రాసినారో చదివితిరా? "మన్రో వీధి" అని వ్రాయఁబడి యున్నది. మన్రో అను నతని జ్ఞాపకార్థమై ఆవీధి కాపేరు పెట్టబడినది. మన్రో ఎవ్వరో మీ రెఱుఁగుదురా? ఇతడు మన జిల్లాయొక్క మొట్టమొదటి కలెక్టరు. దత్తమండలములు ఆంగ్లేయులకు చేరినతరువాత ఈతడు దత్తమండలములకు కలెక్టరుగా నియమింపఁబడెను. ఇతడు అనంతపురమును వాసస్థానముగా నేర్పఱచుకొనెను. ఇతడు అనంతపురమున కట్టిన బంగళా ఇప్పటికిని ఉన్నది. ఇప్పుడు కలెక్టరు నివసించు బంగళాకు వెనుక ఒక చిన్న మందిరమున్నది. దాని వెనుక గోడలో నొక చక్కని చలువరాయి ఉన్నది. దానిమీద 'ఈ మందిరము మన్రో ప్రభువు కట్టించినది' అని చెక్కఁబడి యున్నది. 1807-వ సంవత్సరమున నితఁడు ఇంగ్లండు దేశమునకుపోయెను. 1808-వ సంవత్సరమున దత్తమండలములను బళ్ళారి, కడప అను రెండు జిల్లాలుగా భాగించిరి.

1882-వ సంవత్సరమున బళ్లారి జిల్లాను, మరల, బళ్ళారి, అనంతపురము అను రెండు జిల్లాలుగా భాగించిరి. అనంతపురముజిల్లా జనులు మొదటినుండియు ఆంగ్లేయుల కెట్టి బాధయు గలుగ జేయక విశ్వాసమును చూపుచున్నారు. అనంతపురమున డెప్యూటి కలెక్టరుగారి కచేరియుండు భవనమునందే మన్రోగారు రాజకీయ వ్యవహారములను నిర్వర్తించుచుండిరి. ఇప్పటికిని ఆ భవనముననున్న, చావడికి "మన్రో భవనమని" పేరు. అచ్చట అతని ఛాయా పటము కూడ ఉన్నది. ఇతనికి తోటలు వేయుటయందు చాల ప్రీతి. ఇతని గృహమువద్ద బావిని త్రవ్వించి చెట్లను వేసి పెంచుచుండెను. మన్రో దొరగారికి దత్తమండలములపై చాలప్రీతి. ఈతడు రైతుల కష్టసుఖములను శ్రద్ధతో విచారించుచుండెను. రైతులతో వారివారి భాషలలో మాటలాడుచుండెను. కనుక ఇతనిని రైతుల మిత్రుడని పిలుచుచుండిరి. ఇతడు చేసిన మేలునకై ఇప్పటికిని తలంచుకొనుచున్నారు. ఇప్పటికిని దత్తమండలములలోని వారు కొందఱు తమ బిడ్డలకు అతని పేరు పెట్టుట వాడుకయై యున్నది. జనులకును అతనిపై ప్రీతి యెక్కువ. అతని విషయమై వీరు మాట్లాడునపుడు "తండ్రి" అనియే చెప్పుదురు.

పిదప ఇతడు చెన్నరాజధాని 'గవర్నరు' పదవిని పొందెను. ఇతని సంపూర్ణమైన నామము 'సర్ థామస్



మన్రో.' దత్తమండలముల గుండా ఇతడు ప్రయాణము చేయుచుండగా కర్నూలు జిల్లాలోని పత్తికొండ అను గ్రామమున నీతడు 1727-వ సంవత్సరమున మృతిజెందెను. ఎంతటివారైనను మరణము తప్పదు గదా! సర్కారువారు పత్తికొండ దగ్గర మన్రో జ్ఞాపకార్థమై ఒక తోపు వేయించి, బావిని త్రవ్వించిరి. మన్రోగారి శరీరము మదరాసునందు సెంటు జార్జి కోటలో పూడ్చి పెట్టబడి యున్నది.

గుత్తి గ్రామమున 33000 రూపాయలు వ్యయముచేసి యొక సత్రమును కట్టించిరి. దానికి మన్రో సత్రమని పేరు పెట్టిరి. కొంతకాలము ఆసత్రములో బాటసారులకు అన్నము వేయుచుండిరి. అచ్చట ఒక వైద్యశాలను గూడ యుంచిరి. ఇందులకు సర్కారువారు పైక మొసగుచుండిరి. 1869-వ సంవత్సరమున వేరుగ ఒక వైద్యశాలను కట్టించిరి. బాటసారులకు అన్నము వేయుట మాని వేసిరి. కొంతకాలమునకు పిదప ఆ సత్రమును తాలూకా సంఘమువారి అధీనము చేసిరి.

చెన్నపట్టణమున కూడ ఇతని ప్రతిమను నిలబెట్టియున్నారు. మన్రోవంటి దయాంతరంగుని జ్ఞాపకార్థమై ఎన్ని కార్యములు చేసినను అతని ఋణమును దీర్ప లేము.



# 25. ఆంగ్లేయులు మనకేమి మేలు చేసిరి? I.

—:o:—

మన జిల్లా ఆంగ్లేయులకు ఎట్లు వచ్చెనో చదివితిరి. ఆంగ్లేయులు మన జిల్లాను పాలించుటకు కలెక్టరులను నియమించుచుండిరి. అట్టివారిలో మన్రో మొదటి వాడు. అతని వెనుక ఎందఱో మన జిల్లాకు కలెక్టరుగ వచ్చిరి. ఇప్పటికిని అనంతపురమున ఒక కలెక్టరు ఉన్నాడు. యీ ఆంగ్లేయులు మనకు ప్రభువులైన పిదప మనకేమి మేలుచేసిరో తెలిసికొందము.

1. బాలులారా! మీ రెప్పుడైన మీ గ్రామము మీదుగా దండు పోవుటను చూచియున్నారా? అందులో నెందఱు శిపాయిలు ఉందురో చూచితిరా? వారలలో కొందఱు గుఱ్ఱములపై స్వారిచేయుదురు. వారుమంచి బలము గలవారు. వారియొద్ద కత్తులు తుపాకులు మొదలైన ఆయుధములు ఎన్నియో ఉండును గదా? వారిలో గొందఱు ఆంగ్లేయులు, కొందఱు మనదేశమువారు. వారి కేమిపని? వారి కెవరు జీతముల నిచ్చెదరు? ఈవిషయములు మీకు తెలియవు కదా?



మీరు చదివిన కథలలో అనేకమారులు మహమ్మదీయులు, మహారాష్ట్రులు మన జిల్లాపై దండెత్తి వచ్చి జనులను బాధించుచుండిరి. వారికి లంచములిచ్చి పారదోలుటకై రాజులు జనులకు పన్ను వేయుచుండుటను మీరు చదివియున్నారు. కొందఱు మన దేవాలయములను కూడ పాడుచేసిరి. పూర్వము జనులు ఎప్పుడు శత్రువులు వత్తురో, ఏమో అని భయపడు చుండిరి. మన కిప్పుడు అట్టి భయము లేదు. మనలను ఎవ్వరును బాధించరని ధైర్యముగానున్నాము. ఎందుచేత? మన ప్రభువులైన ఆంగ్లేయులు అట్టి శత్రువులను పారదోలుటకై అక్కడక్కడ మన దేశమంతటను సైన్యమును ఉంచినారు. ఆసైన్యములలో ఒక దానినే మీరు మీగ్రామము చెంత చూచినది. దానినే మీరు దండుఅని పిలుచునది. వారందఱికిని మన ప్రభువులే జీతముల నిచ్చెదరు. మన దేశముపై శత్రువులను రానీయక చేయుటయే వారి పని.

2. మన జిల్లాలో ఎందరో జనులు ఉన్నారు కదా? మహమ్మదీయులు, హిందువులు, క్రైస్తవులు ఇంకను అనేక మతములవారు ఉన్నారు. పలుమారు ఒకరితో నొకరు పోట్లాడుచుందురు. అందరును మంచివారుగా నుండరుకదా? ఒకరు ఇంకొకరి వస్తువులను దొంగలించెదరు. ఇట్టి నేరములు జరుగకుండచేసి మనకు సౌఖ్యము కలుగ జేయుటకు మనప్రభు

వులు పోలీసు సిబ్బందిని ఉంచియున్నారు. ఈ పోలీసువారిని మీరందరు జూచియే యుందురు.

ఈపోలీసు బంట్రోతులకు పైయధికారి 'ఇన్స్పెక్టరు' వారిపై అధికారి డిస్ట్రిక్టు సూపరింటెండెంటు. ఇతడే మన జిల్లాలోనుండు పోలీసు సిబ్బందికి అంతకును పై యధికారి. ఇతడు అనంతపురమున నుండును.

3. పోలీసువారు ఉండినను యెన్నియో నేరములు జరుగును. నేరములను చేసినవారు ఎవరని పోలీసువారు కనిపెట్టవలెను. వారిని శిక్షించిన మరలవారు అట్టి నేరములనుచేయరు. పోలీసువారికి వారిని శిక్షించు అధికారము లేదు. ఆ పనికై న్యాయస్థానములు (కోర్టులు) కలవు. అచ్చట న్యాయాధిపతి ఉండును. ఈ నేరస్థులకు తగిన శిక్ష విధించుటే అతనికి పని. ఇట్టి న్యాయస్థానములు ప్రతి తాలూకా యందును కనీసము ఒకటైన నుండును.

ఒకని భూమినికాని ఇంటినికాని ఇంకొకడు 'నాది'అని పోట్లాడ వచ్చును. ఇట్టి ఆస్తి విషయమైనటువంటియు, అప్పు విషయమయి నటువంటియు వివాదములను తీర్పు చేయుటకు 'సివిల్ కోర్టులు' వేఱుగా నున్నవి. ఇందు వేరు నేరములు విచారింప బడవు. ఇట్టిన్యాయస్థానములు మన జిల్లాలో గుత్తి యందును, పెనుకొండ యందును గలవు. ఇచట ఉండు న్యాయాధిపతికి 'మున్సిఫ్' అని పేరు.



4. బాలులారా! మీరు ఎప్పుడైన పొగబండియందు కూర్చొని యున్నారా? అది ఎంత వేగముగా పోవునో మీరు చూచియుండ వచ్చును. కనుకనే మనము రైలునందు కూర్చున్న త్వరలో మఱొక ఊరికి పోగలము. మనము పొగబండిలో పోవుటవల్ల ఖర్చు చాల తక్కువయగును. మనము ఎద్దుల బండిలోగాని గుఱ్ఱము బండిలోగాని కూర్చొనిపోయిన చాల కాలము పట్టుటయే గాక, చాల డబ్బుకూడ పట్టును. మనము పోవుటయేగాక మన సామానులనుకూడ వేరు చోట్లకు పంప వచ్చును. ఆంగ్లేయులే మనకీ సౌఖ్యమును కలుగజేసినది. మన జిల్లాలో గుంతకల్లు, ధర్మవరము అను చోట్లలో పెక్కు రైళ్లు కలియును. అట్టి చోటికి 'సంధి' (జంగ్షన్) అనిపేరు.

5. అయిన అన్ని గ్రామములకు పోవుటకు రైలు ఉండదు. మనము మడకశిర, బుక్కపట్టణము, కల్యాణదుర్గము మొదలైన గ్రామములకును, ఇంకా పెక్కు పల్లెలకును పోవుటకు రయిలు లేదు. కనుకనే అట్టి గ్రామములకు పోవుట కష్టము. అయితే ఒక గ్రామమునుండి మఱియొక గ్రామమునకు పోవుటకు మంచి బాటలు కలవు. గ్రామము నుండి గ్రామమునకే గాక ఒక గ్రామముననే ఎన్నియో బాట లుండునుకదా? ఈ బాటలపై బండ్లు పోవును. మనుష్యులు నడచి పోయెదరు. యీ బాటలు లేకపోయిన మనకు ప్రయాణము చేయుట చాల కష్టము కదా?

ఎండకాలమున ఇట్టిమంచి బాటలున్నను ఎండకు నడచుట చాల కష్టముగా నుండును. అందుకై బాటకు ఇరుప్రక్కలను సర్కారువారు చెట్లను వేయించి పెంచుచున్నారు. కనుక బాటసారులకు బాటలపైనడచుట అంత కష్టముగా తోచదు. అప్పుడప్పుడు సర్కారువారు యీ బాటలను మరమ్మతు చేయించుచుందురు. ఆ వ్యయమును సర్కారువారే భరించెదరు. ఈపనిని చేయించుటకును క్రొత్తబాటలను వేయించుటకును మనజిల్లాలో ఇంజనీయర్లు, ఓవరుసీయర్లు కలరు. వీరును ప్రజా సేవకులే.

ఇంతమంది నౌకరులను ఉంచి మనకు ఇన్ని సౌఖ్యములు కలుగజేసి నందులకు మన ప్రభువులైన ఆంగ్లేయుల యెడల మనము ఎంతో భక్తివిశ్వాసములను చూపుచుండవలయును. మనమందఱు విశ్వాసముతో సర్కారువారికి తోడ్పడిన మనకు వారు ఇంకను ఉపకారములను చేయగలరు.





# 26 ఆంగ్లేయులు మనకేమి మేలు చేసిరి. II.

———:o:———

వెనుకటి పాఠమున మీరు ఆంగ్లేయులు మనకు చేసిన యుపకారములనుగూర్చి చదివితిరి గదా? వారు చేసిన మేళ్ళు ఇంకను ఎన్నియో గలవు.

౫. బాలులారా! మీరందఱును బడికి వచ్చుచున్నారు కదా? ఎందుకుగాను వచ్చుచున్నారు? మీరు బాగుగ విద్య నేర్చుకొని పెద్దవారైన పిదప ఉద్యోగములుచేసి ధనమును, కీర్తిని సంపాదింప వలయునని కదా? ఇవియేగాక చదువువలన ఇంకను ఎన్నియో ఉపయోగములు కలవు. మనకు ఎక్కువ జ్ఞానము వచ్చును. మనము ఎన్నియో క్రొత్త విషయములను తెలిసికొందుము. మీకు తెనుగు చదువుటకు వచ్చును. కనుకనే మీరు ఈకథలను చదివి సంతోషపడుచున్నారు. చదువురాని వానికి ఏమియు తెలియదు. విద్యచాల ముఖ్యమైనది. కనుకనే మన ప్రభువులు అనేక పాఠశాలలను పెట్టించినారు. మన జిల్లాలోకూడ ననేక పాఠశాలలు కలవు. పల్లెటూరుల లోకూడ ఇప్పుడు బోర్డు పాఠశాలలు కలవు. ఇంగ్లీషు భాషను నేర్పు పాఠశాలలు మన జిల్లాలో అనంతపురము, హిందూ

పురము గుత్తి, పెనుకొండ గ్రామములలో కలవు. ఇంగ్లీషు భాషను నేర్చిన మనవారు, ఎందఱో గొప్ప యుద్యోగములో నున్నారు.

ఈ పాఠశాలలోనుండు ఉపాధ్యాయులకు సర్కారు వారే జీతముల నిచ్చెదరు. మనమందఱు చదువుకొనవలయునని మన ప్రభువుల ఇష్టము. చక్రవర్తియైన జార్జి మన దేశమునకు వచ్చియుండినపుడు కలకత్తా నగరమున ఒక గొప్ప సభయందు ఇటు చెప్పిరి. "మాగవర్నరు జనరల్‌గారు హిందూదేశములో విద్యను వ్యాపింపఁ జేయుటకుగాను విశేష ధనమును ఏర్పాటు చేయుదురు. దేశమునందంతటను పాఠశాలలు నిండియుండి అందునుండి దాజభక్తియు ధైర్యమును, ఉపకారముచేయు బుద్ధియుఁగల పౌరులు బయలుదేరి అన్ని విషయములలోను ఇతరులకు తీసిపోక నుందురుగాక యని కోరుచున్నాను. జ్ఞానము విస్తరించి అందువలన సౌఖ్యము, ఆరోగ్యము, ఊహాలు విరివిఁగాంచి, హిందూదేశమునందలి ప్రజల గృహములు ఆనందముతో నిండియుండు గాక యని కోరెదను. హిందూదేశముయొక్క విద్యాభివృద్ధి విషయము ఎప్పుడును నా హృదయమునకు మిక్కిలి సంతోషమును గలిగించునదిగా నుండును." అందులకే వారు ప్రారంభవిద్య నేర్పు పాఠశాలలలో జీతములు చాల తగ్గించినారు. తురకలకు



అర్థము జీతమే! ఇంకను కొందఱికి జీతము లేని చదువు చెప్పెదరు. బీద బాలురకు పలకయు, పుస్తకములు కూడ ఇచ్చెదరు.

6. బాలులారా! మీకెవ్వరైన బంధువులైన స్నేహితులైన నుందురుకదా? వారు ఎక్కడ నున్నారు? వారికి ఏమైన సమాచారమును తెలుపవలసి యుండిన మీరు ఏమి చేయుదురు? మీకు తెనుగు వ్రాయుటకు వచ్చును. వ్రాసిన ఆ జాబును ఒక కూలివాని చేతికిచ్చిన, దూరముననున్న గ్రామమునకు పోవుటకు చాలడబ్బు అడుగును. అంతయేకాక వాడు చాల కాలమునకు ఆ గ్రామమును చేరును. మీ గ్రామమున ఒక టపాల కచేరి ఉన్నదా? అచట మీరు మూడు పైసాల నిచ్చిన ఒక కాయితము (కార్డు) ఇచ్చెదరు. మీరు దానిలో వ్రాయవలసిన సమాచారమును వ్రాసి, మఱియొక ప్రక్కన మీ స్నేహితుని పేరు, అతడు ఉండు గ్రామమును వ్రాసి ఆ కార్డును టపాల కచేరిలో ఉంచియుండు పెట్టెలో వేసిన అది మీ స్నేహితునికి చేరును. టప్పాల కచేరివారు, పెట్టెయందుండు జాబులనుచేర్చి రైలుబండిద్వారా ఆయాగ్రామములకు పంపుదురు. రైలుబండిలేనిచోట గ్రామములకు మనుష్యులచే పంపుదురు.

చూచితిరా? మూడు పైసాలతో ఎంతపని చేయవచ్చునో! ఆ కార్డుపైన ఉన్న బొమ్మను చూచితిరా? అది మన చక్రవర్తిగారైన జార్జిగారి బొమ్మయే! మూడు పైసాలు కర్చుచేసిన మన దేశములోనుండు ఏ గ్రామమునకైన ఎవ్వరికైన వ్రాయవచ్చును. ఇంతయేగాక మనము ఇతర గ్రామములకు పైకమునైన, పుస్తకములనైన ఇతర వస్తువులనైన తపాల కచ్చేరి ద్వారా పంపవచ్చును. అయితే ఎక్కువ కష్టమయిన పని గనుక మనము ఎక్కువ పైకమును ఖర్చు చేసుకొనవలెను.

తపాల కచేరీలను పెట్టించియుండునది మన జార్జి చక్రవర్తిగారే? టపాలకచేరిలో పని చేయువారందఱు మన చక్రవర్తిగారి సర్కారు నౌకర్లే. సర్కారువారే వీరికందఱికిని జీతముల నిచ్చెదరు.

మన జిల్లాలోనుండు వారందఱు ఎల్లప్పుడును ఆరోగ్యులై ఉండరుకదా? కొందఱు రోగములచే బాధపడుచుందురు. ధనవంతులు పైకము వ్యయముచేసి రోగములను కుదుర్చుకొందురు. పాపము బీదల గతి ఏమి? వారికి డబ్బులేదు కదా?

మనజిల్లాలో పెద్ద గ్రామములలో నక్కడక్కడ వైద్యశాలలు గలవు. అచ్చట ఒక వైద్యుడును కొందఱు నౌకర్లును ఉందురు. వారందఱు సర్కారు నౌకర్లే! ఆ వైద్యశాలకు



పోయిన వారల కెల్లరకు మందులనిచ్చి రోగమును కుదిర్చెదరు. రోగము బలముగానుండిన వారిని అచటనే ఉంచుకొని ఆహారమును కూడా పెట్టి రోగమును బాగుచేసి పంపెదరు. ఈ ధర్మవైద్యశాలలు అన్నియు మనచక్రవర్తిగారు పెట్టించినవే! ఈ వైద్యశాలలు మనకెంతో మేలు చేయుచున్నవి. ఎందరి ప్రాణములనో రక్షించి పైన చెప్పిన అధికారులకు నౌకరులకు సర్కారువారే జీతముల నొసంగెదరు. పై రెండు కథలలోను ఎందఱో నౌకర్లనుగూర్చి చదివితిరి. వారలకు అందరికిని జీతముల నిచ్చుటకు ఆంగ్లేయులకు ధనము ఎక్కడిది?

మీ నాయనకు భూములు కలవా? ఆయన మీయూరు రెడ్డికి అప్పుడప్పుడు గుత్త రూకలు నిచ్చును కదా? పెద్ద గ్రామములలో నుండువారు తమ ఇండ్లకుకూడా గుత్త ఇచ్చెదరు. వ్యాపారము చేయు సాహుకారులు కూడ తమ లాభములో కొంతభాగము సర్కారువారికి కట్టెదరు. వీరందఱును ఎందుకు ఈరీతిగా పైకమును సర్కారు వారికి ఇవ్వవలెను. ఆంగ్లేయులు మనకు చేసియుండు మేలునకుగానే! వారు ఈ పైకమునంతయు చేర్చి పైచెప్పిన రీతి మనకుగాను వ్యయము చేసెదరు. కనుక మనము యిచ్చు పైకమునే మనకుగాను వ్యయముచేయుట. అయినను మనము ఇచ్చు ద్రవ్యమునంతయు వారు వ్యయము చేయరు.

బాలులారా! చూచితిరా, మన రాజుగారైన పంచమ జార్జి చక్రవర్తిగారు ఎంతదయగలవారో? వారు మనకై ఎన్నియో మేళ్ళు చేసియున్నారు. ఇంకను చేయుదురు. కనుక మనము వారియెడల నెంతో భక్తి విశ్వాసములు కలిగి యుండవలెను.

మన పంచమ జార్జి చక్రవర్తిని దేవుఁడు చిరకాలము రక్షించుగాక' అని మనము ఎల్లప్పుడును ప్రార్థించుచుండవలెను.



COPIES CAN BE HAD OF :—

N. VASUDEVA RAO,
*Asst. Master,*
*Board Secondary School,*
*PENUKONDA.*

AND

**M. P. SARMA & Co.,**
*Proprietors,*
Kameswari Press.
BELLARY

---

## యం. పి. శర్మ కంపెనివారి స్వంత గ్రంథములు.

| | | | |
|---|---|---|---|
| బాల రామాయణము | 0-6-0 | బాల కుచేల చరిత్ర | 0-4-0 |
| బాల భారతము | 0-6-0 | మయూరధ్వజుని చరిత్ర | 0-4-0 |
| బాల భాగవతము | 0-6-0 | బాల రుక్మాంగద | 0-4-0 |

| | |
|---|---|
| కాళిదాసు చరిత్ర | 0-5-0 |
| రామదాసు చరిత్ర | 0 5-0 |
| కబీరుదాసు చరిత్ర | 0-5-0 |
| ప్రభుభక్తి రత్నావళి ... | 0-2-0 |



ఇదియుఁగాక మా దగ్గర ఎలిమెంటరీ స్కూళ్ళకు వుపయోగమైనటువంటి రిజిస్టర్లు, పుస్తకములు మొదలైనవి దొరుకును. కావలసినవారు యీ క్రింది అడ్రెస్సుకు వ్రాసి తెప్పించుకొన వచ్చును.

యం. పి. శర్మ అండు కంపెని,
కామేశ్వరి ప్రెస్, బళ్ళారి.

